# దేశిక

(సాంఘిక నవల)



రచన :

అన్నే ఉమామహేశ్వర్



ప్రగతి ప్రచురణలు

ఏలూరు రోడ్డు : : విజయవాడ – 2.

# పాఠకులకు

ఈ నవలను కొంతకాలం క్రిందటనే రచించాను. మొదట దీనిని చాల చిన్నదిగా రూపొందించటంవలన చివరి భాగంలో కథ తేలిపోయిందనే వుద్దేశంతో దానిని తిరిగి ఇంకోసారి సవరించాలనే తలంపుతో రెండు భాగాలుగా విభజించడమైనది.

ఈ నవల విషయంలో నా కెంతో ప్రోత్సాహమిచ్చి తొలిసారిగా ముద్రించుకొనుటకై పూనిన ప్రచురణ కర్తలకు నా ధన్యవాదములు. ఇందు తప్పులున్న పాఠకులు మన్నించిన మలిసారి వాటిని సవరించుకోగలను.

— రచయిత.

# సమర్పణ

కవితా వనంలో వీచిన కమ్మని వాయువును అత్యంతాసక్తితో, ఆఘ్రాణించినపుడు కల్గిన కవనాసౌందర్యపు ముద్ద; నాలో ఎందుకో నివాళిపల్కించి నిబిడీకృత మయినందున .... ఫలితం .... నాయీ చిన్ని నవల. .... దానిని .... నా తలిదండ్రుల పూజకొరకే సమర్పితముగాన అందుకోమని వారికి నా వేడికోలు,

ఉమామహేశ్వర్

ప్రతి జీవి పువ్వుల్లో పెట్టి పూజింపబడాలంటే అను కున్నంత సాధ్యమయ్యేపనిగాదు. అలా జరగటంలో గూడ రెండురకాలున్నై. ఒకటి – చిన్న దేశంవంటి కుటుంబ నిర్వ హణలో చూపిన ఓర్పు విజ్ఞానపూర్వక సహజలక్షణాలన్నిటి సద్వినియోగ సంయోగంలో గలిగిన ఆనందాన్ని, ఆ కుటుం బాన్ని నిర్వహించేవారు అచ్చట మాత్రమే అంటే ఆ చిన్న దేశంవంటి కుటుంబంలో పూజించబడుతారు. అదే కొన్ని కోట్ల జనాభాగల విశాలవలయంవంటి దేశంలో నిష్కలంక మైన ప్రేమ, సహజ దేశభక్తిని చూపించినప్పుడు అఖండ ఘనతర కీర్తి సామ్రాజ్యంలో తను ఒక ... సభ్యుడో ... యింకా ... గొప్ప హోదాయో ... పొందటం సహజమైన విషయమేగాని ఏమంత చెప్పుకోదగినదిగాదు. ఈ రెంటిలో ఏదీ పొందనివారు వాళ్ళ కార్యకలాపాల పరిణామాలు, పరిస్థితులను తల్లక్రిందులుగా జేయవచ్చునేమో... అప్పుడే నిరాశా నిస్పృహలతో నిర్జీవమైన మనస్సుతోనే నిరామయ మైన నిశీథంలో విషాదపూరితమైన పరిణామాన్ని వెయ్యి ముక్కలుగా చీలిపోయి చెదరిపోయిన హృదయంతో వెయ్యి రకాలుగా, వెయ్యి కోణాలద్వారా చూడటం జరుగుతుంది. తన కనుగుణ్యమైన పద్ధతిలోకి రూపొందించుకోబడుతుంది. ఆ విధంగా జరగటమైనా తాత్కాలిక సుఖావేశాపూరిత మైన నరసమూహ సంతృప్తికే.

"ఇప్పుడెలావుంది మీ ఒంట్లో" అనడిగిందామె.

"ఫరవాలేదు" ... ఆమెను చూడటానికి ప్రయ త్నంతో ఓపిగ్గా కనుపించని చిరునవ్వుని వ్యక్తం చేయలేని

మందహాసంతో యివతలవైపు దిరిగిచూచాడు. ఆమె తలుపు చాటునుండి రాలేకపోయిందెందుకో ... మరి ... అందువలనే నిస్పృహగా యింకోసారి తలుపువైపు చూచాడు. గాలి వీవనకు ఆమె చీరకొంగుమాత్రం ద్వారంమధ్యందాకా అప్పుడప్పుడు విసురుతోంది. ఆమెలోవున్న అంతరార్థం.?

నెమ్మదిగా వినపడి వినపడనట్లుగా పార్వతీ" అన్నాడతను."

"................"

"మాట్లాడవే పార్వతి ......"

"ఆ ......"

ఆమాట తలుపుచాటునుండే వచ్చింది. ఇంకేదో చెప్పతుందేమోనని ఆశగా చూచాడు ... ... కాని ఏమీ రాలేదు ...... మళ్ళీ మాటలు పెంచాలని గాబోలు మీ వారు ... భాస్కరం ఎలా వున్నారు."

"బాగానే వున్నారు"

"సరే ముందు లోపలికిరా" ... ... పార్వతీ ఎందువల్లనో ఆమె లోపలికి రాలేకపోయింది. కాని యీసారి ద్వారమధ్యంలో నిలబడే అతనివైపు చూచింది. మిణుకు మిణుకుమని గాలి రెపరెపలకు నృత్యంచేస్తున్న సన్నని దీపపుకాంతిలో ఆమె ముఖంలోనుంచి ప్రసరించే స్వచ్ఛందాలంకారమైన సొగసు తళుక్కుమని మెరిసింది. ఎవరీమె ? పార్వతేనా? ...... నిజంగా పార్వతే...అవును పార్వతే... ఆమెలో చనువులేదు.

అతనికి వినబడేటట్లుగా "రేపు సాయంత్రం రైలుకు మళ్ళీ వెళ్ళిపోతున్నాను."

" ఆ ........."

"మాయింటికి రాగానే నీకు జ్వరంగా వుందని మా అమ్మ చెప్పింది. అందువలన నేవచ్చాను...

ఈసారామె రవంత తీక్షణంగా గాలికి అర్ధచంద్రాకారంగా మారిన దీపందాకా వెళ్ళినై.

"నేను ... వెళ్తున్నాను"

" ఆ ... " ఈసారి తను మంచంమీదనుంచి లేవబోయాడు. లేవలేక ... మంచంమీదే వుండి ... వెళ్తున్నావా పార్వతీ? " అన్నాడు.

" ......... "

ఆమె సమాధాన మతనికందలేదు. నిజంగా ఆమె వెళ్లిపోయిందేమో. ఒకవేళ మళ్లీ కనిపించదా ? ఒకవేళ తనే వెళ్ళి పలకరించడానికి ... ఓపిక లేదు. 6 రోజుల జ్వరం 6 నెలల శక్తిని గుంజేస్తుంది. ఇప్పుడెలా చేసేది. లేదు లేదు. ఒకవేళ శక్తి వున్నప్పటికి ఆమెను పలకరించగూడదు. ఆ మిప్పుడు "భాస్కరాని కర్ధాంగి " రెండు నిమిషాల క్రిందటే సన్నని వెలుగులో ఆమె మెడలోవున్న మాంగల్యపు మధ్య భాగంలో భాస్కరం కనిపించాడు. అలా ... మాట్లాడటానికి సాహసించితే భాస్కరానికి ద్రోహంచేసినట్లే........."

అతని మెదడులో ఆలోచనారైలు పరిగెత్తుతూ పట్టాలుతప్పి పడిపోయింది. అందులో ప్రయాణం చేస్తున్న నరసమూహం ... (నరులు) దీనాలాపాలతో ... అతని

హృదయం చెదరిపోయేలా రోదించింది. అయినా ఆమెను పలుకరించ వలసినంతవసరం తనకేమిటి? అందువల్ల కలిగే ... లాభం ? ... శూన్యం ... ... కాదు, కాదు ... అదోరకమై నానందానుభూతి. అది ప్రేరేపించబడినదే కావచ్చు కాని తాను నిష్కల్మషిగాదుగా.

# 2

మండు టెండలు కొంచెము తగ్గినై. ఇక బాధుండదు. మానవుడెప్పుడు బాధేనేమో ... లేదు. అదంతా ప్రకృతి సహజం. ప్రకృతిమాతనేక భంగిమలతో అంటే మూడు రకాలుగా ... ప్రాణుల్ని ముద్దుపెట్టుకుంటుంది. అదే యెండాకాలం... "అబ్బ! చాలా తీవ్రమైనఎండలు అంటారు. పోనీ వర్షాకాలంవస్తే... " అబ్బబ్బ ... ఎంత వాన యేం సంగతి. పొయ్యిలో పుల్లలుగనక తడిసిపోతే నంటింట్లో కమ్మే పొగలకు కళ్ళలోనుంచి కారే నీటిని తుడుస్తూ పాడు వానా కాలమంటారు. ఇక పోతే శీతాకాలం. బయటకొస్తే చలి ఇంట్లోకిపోతే చలి. ఈ శీతాకాలం పాడుగాను అంటారు. ఇకపోతే యేకాలం కావాలి ... మరి.

శేఖరానికి మెలుకువవచ్చి చూచేటప్పటికి గడియారం ముళ్ళు రెండూ తొమ్మిదిమీదున్నై ...... "అరే" చాల

టయిమయిందే అనుకుంటూ తొందరపాటుతో లేచి గుబళ్ళు పుట్టిన పిచ్చివానిలా తిరిగాడు.

పరుగెత్తే మనస్సుకు హద్దులుపెడుతూనే అతను పూర్తిగా కర్తవ్యాలన్నిటిని సంభాళించుకునే సంసిద్ధుడయ్యాడు. "ఏం, శేఖరుబాబు త్వరగారా" అంటు గడపవతలనుంచి ఒక కంఠం ధ్వనించుకుంటూ లోపల ప్రవేశించింది.

"ఇదిగో అయిపోయింది"

"అయినా యిప్పటిదాకా యేంచేశావు... అబ్బబ్బ ఈ కవిగాళ్ళ గోడవంతా యింతే. రాత్రి యే పన్నెండు గంటలదాకానో యే కథానాయికి పాత్రనుగురించో... కథానాయిని వంపు సొంపులు, వయ్యారాలను పూహానగరంలో చిత్రించుకుంటూ వుండి ఉదయం యే తొమ్మిది, పదిగంటలకో నిద్రలేస్తారు ...... "

"కాదురా మధు"

"ఏంకాదు ...... కానీ, తొందరగా". మధుకూడ అతని క్రోవకు చెందినవాడే... అంటే కవి గాకపోయినా చిత్రకారుడు. సంగీత విద్వాంసుడు, చిత్రకారుడు, కవి వీళ్ళంతా తమ హృదిమందిర ప్రాంగణాల్లో మాట్లాడే దొక భాషలోనే. వీళ్ళచేత చిత్రించబడే చిత్రాంగిలంతా ఒకే పోలికగా వుంటారు. ఏరకమైన భాషలోని అనుబంధాలనైనా తేలికగా తమ భాషలో కనువదించుకుంటారు. కాని ...... ఎంతటివాళ్ళు ...... అయితే ... ఇంట్లో యీగలమోత, బయట పల్లకీలమోత, "ఇదంతా యెవరెరగనితంతు"

అన్నాడు మధు. ఇల్లు తాళంవేసి యిద్దరూ బయటకు నడిచారు.

మన గోత్రాలు మనతో కాపురాలు వెలగబెట్టే నారీమణులకు తప్ప ఎవరికి తెలియవులేరా అన్నాడు కవి గారు. పార్కులోవున్న గడియారం పదకొండు కొట్టింది. యిద్దరూ యింకా తీక్ష్ణంగా ఆలోచించుకుంటూనే సంభాషించు కుంటున్నట్లున్నారు. రోజూ యిద్దరికి అదొకలవాటు. పార్కులో వున్నవాళ్ళంతా వెళ్ళిపోయేవరకు వీళ్ళుమాత్రం పోరుగదా. పైగా వాచ్‌మన్ యిక వెళ్ళండి అనేవరకు కూడ వెళ్ళరు. ఏవో పెద్ద రాజ్యాంగ సమస్యలన్ని వీళ్ల నెత్తిమీదే వున్నట్లు. "కవిగారికి పెళ్ళవలేదుగాబట్టి లోకమంటే ఏమీ తెలియదు" లే అన్నాడు చిత్రకారుడు మధు. ఏదో ఒక డజనుమంది పిల్లలుకలవాడిలా మొఖంపెట్టి.

నిజంగాకూడ మధుమూర్తి పనంతా అంతే ఎవ రన్న 10 రూపాయలు యిస్తే... ఆరోజే 8 రూపాయలు ఖర్చుపెడతాడు. మర్నాటినుంచి యింటిచుట్టు అప్పులు, యింట్లో అప్పులు. యింట్లో అప్పులు అంటే ఏ డబ్బాలు చాటునో ... పావలో అర్థో దాచుకున్నడబ్బులు యిల్లాల దగ్గర పుచ్చుకుంటాడు. రేపిస్తాగా అనిఏవో కుంటి సాకులతో నచ్చచెబుతాడు. అతని జీవితాన్నంతా తెలుసుకున్న కవి గాబట్టి శేఖరుకూడ చాల జాలిపడేవాడు. జాలిపడిమాత్రం ఏం చేయగలడు. తనుగూడ అతని తాతలాటి వాడేగా ఖర్చులో.......

"ఏమండీ యిక వెళ్ళాలి సార్" అన్న పార్కు వాచ్ మన్ మాటలు వినబడగానే యిద్దరు వాడివైపు చూస్తూ గేటుదాటారు.

# 3

"యథాప్రకారం సిద్ధిరస్తు... మర్నాడుకూడ అదే ప్రదేశంలో దమ్మిడీ ఆదాయం, క్షణం తీరికలేని స్వాములిద్దరూ చేరారు" అని పార్కు వాచ్ మన్ లోలోనే అనుకుని వాళ్ళిద్దరిప్రక్కగానే చూస్తూ వెళ్ళిపోయాడు.

"ఏమండి" అని ప్రక్కనుంచి వినిపించేసరికి ఇద్దరు అటువైపుచూచి "ఎవరండి" మేమేనా అన్నారు ఒకేసారి.

"అవును. మీరే!"

ఇద్దరిలో యెవరిని పిలిచినట్లని శేఖర్ మధుమూర్తులిద్దరూ ఒకరి మొఖాలొకరు చూచుకున్నారు. "ఏమండి" అని మరొకసారి వినబడింది.

"ఏం కావాలండి?"

ఇద్దరిగొంతుకలు ఒకేసారి మ్రోగినై.

"నిన్న ప్రొద్దుటనుండి భోజనమే చేయలేదు. ఎవర్నడగాలన్నా చాలా సిగ్గు. బాధగావుంది. దయయుంచి మీరేమీ అనుకోకుంటే ఒక కాఫీ యిప్పించండి". అతని

గొంతులోనుంచి వచ్చే స్వరం మారిపోయింది. రెండు రోజులనుంచి ఆకలికి అటమటించి పోతున్నాక భాగ్యుడికి గుక్కెడు కాఫీయైనా యివ్వలేకపోవడం మానవత్వానికి సిగ్గు చేటనుకున్నారు. ఒకనాడు శేఖరుగూడ అదే అవస్థపడ్డాడు. కాని తనుగూడ ఆనాడు యెవరినీ అడగలేక సిగ్గుతోను, బాధ తోను కృంగిపోయాడు. చివరి కెవరో మానవత్వం కొంచెం మిగిలివున్న మానవుడా అవస్తను గ్రహించి క్షుద్బాధ చల్లార్చి సాగనంపాడు. ఆ సంగతి మధుమూర్తికికూడ తెలుసు. అందువల్లనే ప్రపంచంలో సంఘటిల్లే బాధల పర్యవసానాలు తెలుసుకాబట్టే శేఖరు మధుమూర్తులిద్దరూ "లేవండి కాఫీకి. ఆ కనబడే హోటల్లో త్రాగుదురుగాని" అంటూ లేచారు.

"గత రెండునాళ్ళనుంచి ఆకలితో దహించుకుపోతు న్నందువలనా బాటసారి రెండుక్షణాల్లో వాళ్ళు తెప్పించిన టిఫిన్ కాఫీత్రాగి క్షుద్బాధతీర్చుకుని చిరునవ్వు ముఖంతో వాళ్ళిరువురికి ధన్యవాదా లర్పించాడు.

"మీదేవూరండి" అని మధుమూర్తి తన్ని ప్రశ్నించాడు. సమాధానంకోసం శేఖరుగూడ అతనివైపుచూచాడు.

" మాది ...... మాది ...... అదంతా అడిగి ...... నన్ను .........

"ఏం బాధగావుందా"

"ఏమీలేదు అవన్ని జ్ఞాపకమొస్తే ... కడుపు దహించుకు పోతుంది. " బావురుమని చంటిపిల్లవాడిలా కన్నీటి బొట్లు రాల్చాడు ... వినండి ... చెపుతాను.

# 4

అదొక చిన్న పల్లెటూరు. ప్రకృతి కాంతకు, జడలో పువ్వువంటిది. సంఘ జీవనానికదొక నాంది. ఒకరొకరు మోసం చేసుకోవడ మెరుగని అమాయక ప్రాణులతో అలుముకున్న కుగ్రామం.

ఆమాటలు, పల్లెపట్టును గురించి యింత చక్కగా చెప్పినందుకు మధుమూర్తి మనస్సులో ఏదో పూర్వపు మమత గోచరమవుతున్నట్లున్నది. యింకా చాలా దగ్గరగా జరిగి చెవులు రిక్కించి వినటం మొదలెట్టాడు.

మీ యిద్దరి స్నేహానురాగాలుచూస్తుంటే ఆనాటి రవి, శంకర్‌లలోనుంచి తొంగి చూచిన సుహృద్భావాలు, అభ్యుదయవాదాలు గాలిలో కలిసి యీ నాటికి ప్రపంచంలో విసురుతున్నయా అనిపిస్తున్నవంటూ ఆయన మళ్ళీ ప్రారంభించాడు.

రవి బాగా చదువుకున్నవాడు నిగర్వి. అభ్యుదయ వాదాలతో కాలం గడిపేవాడు చాలినంతౌస్తుంది గదా యని విర్రవీగేవాడుగాదు. తను శంకర్‌తో గలసి వింత వింత చర్చలు ప్రారంభించేవాడు. మొదటరోజుల్లో రవి చెప్పేవన్నీ జరిగేవా అనుకునేవాడు శంకర్. కాని పిదప కాలక్రమాని కలవాటు పడిన శంకర్ కతనిపై పూర్తి నమ్మకం కలిగింది. "కొన్ని విశాలోన్నత భావాలు కావాలంటే ఎవరిదగ్గరో ఒకరి దగ్గర అంటే...అవివున్న వాళ్ళ దగ్గరే నేర్చుకుంటే మాత్రం పొందించుకోగలరు. ఛత్రపతి శివాజీలో గలిగిన

దేశాభిమాన పూరితమైన ఆవేశోద్రేకాలు అతని కలంకా రాలుగా అతని తల్లి జిజియాభాయి తీర్చిదిద్ది. ఉగ్గుపాలతోనే ఉన్నత గుణాలను నేర్పింది. కాని రవీ నీకెవరు యీ విశాల గుణాలను గురించి చెప్పి నీలోవున్న వున్నత గుణాలను విస్తృతం చేసింది అని శంకర్ తని కౌగలించుకునే వాడు.

మానవుడై పుట్టినందువలన తన కనీస ధర్మాన్ని నిర్వర్తించటానికే మానవుడు వెనకాడ గూడదనేవాడు రవి.

చిన్నతనంలోనే యిటువంటున్న తాశయాలతో గూడిన గుణగణాలుండటం చాల మంచిదనే వుద్దేశంతో శంకర్ అస్రువులు రాల్చేవాడు. నా స్నేహితుడు మేరువు లాటివాడని మురిసిపోయేవాడు. పైన చెప్పిన కుగ్రమవాసు లైన రవి, శంకర్ లిద్దరు పట్నంలోనే చదివారు. అప్పట్లో రవి పట్నంలో చదువుకునే రోజులు.

# 5

దేశికాదేవికి రవికి యీనాటికి కలిగివున్ననుబంధం ఆనాడు చదువుకునే రోజుల్లో ఆరంభమైనది. దేశిక తండ్రి రిటైరు ఆఫీసరుగారు. కోరమీసాలు, ఆయనను ...చూస్తుంటే

చాలా భీకరంగా కనిపించేవాడు రవిశంకర్‌లుండే మేడ క్రిందిభాగంలోనే ఆమె తలిదండ్రులు అద్దెకుండేవాళ్లు. ఆమెగూడా రవిక్లాసే అయినా, యిద్దరు ఏనాడూ మాట్లాడు కునేవారు గాదు. కారణం. అదో కనుభంధమైన సాంప్ర దాయికసహజలక్షణం. దాని హద్దుమీరితే జరిగే పరిణామం చాల పెద్దదని వాళ్ళకి తెలుసు. అందువల్లేనేమో, ఏ విష యంలోను ఏరకంగాను స్వతంత్రించి మాట్లాడుకోటానికి సాహసించలేదు. అలా మాట్లాడుకోక పోవడం సంఘ సాంప్రదాయమే కాకుండా జీవిత భవితవ్యంలో కాలుజారి క్రమం తప్పకుండకూడ వుండేందుకేనేమో అని పిస్తుంది. ఆమెకు రవికి గలగిన తొలిపరిచయం చాలా హాస్యాస్పదంగా కన్పిస్తుంది. మేడమీద నీళ్ళు క్రిందపోర్షన్ దొడ్లో పడిన సంఘటన ఫలితం రవి, దేశికలు, మాట్లాడుకోవడమేగాదు పోట్లాడుకోవడందాకా జరిగింది.

తరువాత మరోకారుమాసా లవలీలగా గడిచి పోయిన్నై, అంటే కాలేజి వార్షికోత్సవాల సమయమొచ్చింది. శంకర్ ప్రోద్భలంవల్లనే రవిగూడ వార్షికోత్సవ సందర్భంలో సభలో మాట్లాడడాని కిష్టపడి తన కార్యక్రమాన్ని ముందు గానే కాలేజి సభల కార్యదర్శికి చెప్పి తనపేరుకూడ నమోదు చేయించుకున్నాడు. అతను మాట్లాడే విషయం "సభ్యత-సంఘం" దాని పరిణామాలు, వాటినిగూర్చి అభ్యు దయ తార్కికంగా వుపన్యసించడం వాటినిగూర్చి చెప్పా లంటే రవి, అందెవేసిన చెయ్యేనని శంకర్‌కి బాగా తెలుసు. అందువల్లనే గాబోలు అంత ప్రోత్సాహమిచ్చాడు.

# 6

విద్యార్థులంతా వార్షికోత్సవ సందర్భంగా గాబోలు గుంపులు గుంపులుగా జేరి జరగబోవు సభా వుపన్యాసాలగురించి చర్చించుకుంటున్నారు.” అందరు నిశ్శబ్దంగావచ్చి హాలులో కూర్చోవాలి” అని శక్రటరీగారు మైక్ లో కంగుమని కంచు మోగినట్లు మోగిందిచాడు. వరసగా విద్యార్థులు, విద్యార్థినులు వెళ్లి హాల్లో ఎవరిసీట్లలో వారుచేరగిలబడి ఉత్సాహంతో సభా వేదికవైపు కేంద్రీకరించిన మనస్సులతో ఉద్యుక్తులై వున్నారు. అదే, ఆ వేదిక తరువాత అంటే వుపన్యాసాల తరువాత రంగస్థలం గూడాను, ముందుగా శెక్రటరీ కాంతారావుగారు సంఘాన్నిగురించి మాట్లాడాలి; అన్నారు సభాధ్యక్షులు. కాంతారావు వేదికమీదికొచ్చి సంఘం దాని పరిణామాలు, కలిగే ప్రమాదాలు, ఆ ప్రమాద ప్రమోదాలకు ఎవరెంతవరకు బాధ్యులో వాటికి బాసటగావుండే పరిస్థితులు, పరిసరాలు, చాలా చక్కగా దీర్చిదిద్దినట్లుపన్యసించాడు. వుపన్యాసధోరణి చాలా బాగుందన్నట్లు అందరు హర్షధ్వానాలు ప్రకటించారు. తరువాత రవిగారు కూడ అదే విషయాన్ని గూర్చి అభ్యుదయమార్గంలో తార్కిక పూర్వకంగామాట్లాడుతారు”అని సభాధ్యక్షుడు తిరిగియింకోసారందరికీ వినబడేటట్లు చెప్పాడు. ముందుగా అదేవిషయాన్ని గురించి కాంతారావు ద్వారా విన్పించడంవలన, అనుకున్నంత పూర్వపు వుత్సాహాన్ని ప్రకటించలేకపోయారు.

ఇంతలో రవి వేదికమీదకు వొచ్చి అందరికి నమస్కరించి తనుపన్యాసాన్ని ప్రారంభించాడు.

సోదర సోదరీ మణులార అని అతను తెలుగులోనే ప్రారంభించాడు. "ఇంగ్లీషులో మాట్లాడాలి" అని కొందరు విద్యార్థులు కేకలు పెట్టారు. తిరిగి మళ్ళీ రవి అవన్ని విన బడనట్లుగా ప్రారంభించాడు.

"వినండి......ఇంగ్లీషులో మాట్లాడమని కొందరు సోదరులన్న మాట మన దేశానికే సిగ్గు సిగ్గు," "కొందరు తప్పట్లు కొట్టారు. ముందు భాగంలో కూర్చునివున్న దేశిక దేవి గూడ ఆమాటకు తప్పట్లు వాయించింది. కాని, రవి యింత జ్ఞాన పూరితమైనమాట మాట్లాడతాడని ఆమెకు కొన్ని నెలల క్రిందట జరిగిన పోట్లాట రోజున తెలియదేమో, అని రవనుకునేటట్లు ముఖం జేవురింప జేసి వుద్యుక్తురాలై వెదికవైపే కధ్యానంగా చూడటం మొదలెట్టింది. మళ్ళీ రవి ప్రారంభించాడు.

స్వజాతీయులమై వుండి, స్వదేశీలయుమైవుండి స్వాభిమానాన్ని నిలువునా ఖూనీచేసి యింగ్లీషులో మాట్లాడటం మంచిదిగాదని చెప్పినందుకు క్షమించండి; మన భాషర్థంగానివాళ్ళతో యింగ్లీషు మాట్లాడటం సహజం. సంఘంలో మానవుడు నేర్చుకోవలసిన మొదటి మెట్టే యిది. ఇంగ్లీషు మాట్లాడడంలోగల గొప్పదనంకంటే చందోబద్ధమైన స్వభాష మాట్లాడటం చాల వుత్తమమైనదేమోనని పిస్తుంది. మానవుడు తననుతాను తెలుసుకోనంత వరకు సంఘటిల్లే యిటువంటివాటిని గురించి తనలోతాను తార్కి

పూర్వక సంవాదం జరుపుకుని తుది నిర్ణయానికి కట్టుబడి పోవడమే అగోచరానుబంధమైన సంవాదం. అట్టి సంవాద పూర్వక సందర్భాలలో పరిస్థితులు, సరిసరాలు, పనిలేక పోయినా జోక్యం చేసుకుని దుయ్యబడతై దూషిస్తై. రెండు చేతులతోను దీవిస్తున్నట్లుగా నటిస్తూనే మెటికలు విరుస్తవి. ఆ సంగతి తను దూరంగా వున్నంతసేపు తెలుసుకోలేక పోవచ్చును. అంటే స్వార్థం శారీరకం గానేగాదు. మానసికంగా మాత్రం వుండాలేమో! ఆ విషయాలుగూడ ఆలోచించండి. మన చుట్టూవుండే పరిధులు ముళ్ళ పొదల వంటివి. వాటిని దాటవతలకు మరికొంచెం దూరంపోతే పడగవిప్పిన నాగుబాములాటి సంఘం కోరల విప్పుకుని కబళించటాని కొస్తుంది. తన కవసరమైనప్పుడు వుపయోగించుకునేది సంఘమే తన కనవసరమనుకున్నప్పుడు దూరంగా నెట్టేస్తుంది. అంటే సరితూగని బానిసలుగా పడివుండి నల్లుల్లా నలిగి నులివై పొమ్మని ఎవరుచెప్పరు. అలా అనర్థంగా బలైపోయేదానికంటే మీరు సాధించదల్చుకున్న ఉన్నతాశయాలతోగూడిన కార్యాన్ని పూర్తిజేసేవరకు, అడ్డు వచ్చే శక్తులన్నిటిని ఎదుర్కొని పోరాడి చివరకు మీ జీవిత సర్వాన్ని త్యాగం చేయవలసివచ్చినా వెనుకాడవద్దు. సంఘం సంఘం అని ప్రతివాళ్లు సంఘాన్ని దుయ్యబడతారు. కాని అలాచేసేవాళ్ళు కూడా అవసరమైనప్పుడు ఆ సంఘానికే సభ్యులుగాను, అతిథులుగాను, కార్యకర్తలగాను మారతారు. అది సహజమేనంటూరు. నైతికంగానూ, ఆర్థికంగాను పతనమై పోతున్నప్పటికి, తను చేసేపనినిచూచి

సంఘం పరిహసిస్తుందేమోనని వ్రైరివ్యూహాలతో సంఘం తోక పట్టుకుని వేలాడే దానికంటే తనవల్ల ఆ సంఘానికి కూడ ఏదైనా వుపకారం జరగగలదేమోనని వూహించి, దాని కనుబంధమైనవాటిని చేయటం ఒక్కొక్కప్పుడు సమంజసం కూడాను. ఇవన్ని చెప్పినందుకు మీలో కొందరికి నామీద బాధగలగవచ్చు. మరికొంద రభినందించ వచ్చును. ఇవన్ని చెప్పినందువల్ల మీలో కొందరు దూషించినప్పటికీ, దయయుంచి క్షమించి నేను చెప్పినవి పూర్తిగా ఆలోచించి తరువాతోక నిర్ణయానికి రాగలరనే పరిపూర్తి విశ్వాస మనస్సుతో యింతటితో నేను విరమిస్తున్నాను" పైవిధంగా రవిబాబు మాట్లాడి వేదికమీదనుంచి దిగబోయాడు. హాలంతా హర్షధ్వానాలతో పదిహేను నిమిషాలపాటు దద్దరిల్లిపోయింది. రవిబాబు మాటలకు దేశికాదేవి గూడ మురిసిపోయి అనుకోకుండానే చప్పట్లు కొట్టింది. అనుకోకుండానే రవిబాబు మెడనిండా పూలమాలలు నిండిపోయినై. మెడ నిండిన దండలన్ని అతను ఒక్కొక్కటిదీసి సభాధ్యక్షుని ముందున్న బల్లమీద పెట్టేశాడు. అతను తలెత్తి చూచేటప్పటి కాశ్చర్యం కలిగింది ...... ఏమిటి ఆడపిల్లల మధ్యలో నుంచి దేశికాదేవిగూడ ఒక పూలమాలతో ఆతనికెదురుగా ప్రత్యక్షమయింది. కొన్ని నెలలక్రింద తనతో కుస్తీపట్టిన కంఠమీనాడు అభివందనపూర్వక దీవెనలతో పూలమాల అలంకరింపించుకోమని దీనంగా చెప్పినట్లనిపించింది. ఏదో నిగూడార్థంతో అతనామెవైపు చూచాడు. సరిగా చూడకముందే ఆమె చేతిలోవున్న పూలదం డతనిమెడ నలంకరిం

చింది. క్షమించండనే భావాన్ని గోచరింపజేసె దృష్టితో ఆమెగూడ అతనివైపదోలా చూచి వేదికదిగి వెళ్ళి తన స్థానంలో కూర్చుంది. రవిబాబుకు జరిగిన ఘనసన్మానానికి, ముఖ్యంగా అతను చెప్పిన ప్రతిమాటలోని ప్రత్యక్షరంలోను వెల్లివిరిసె సత్యానికొాక రూపుందని శంకర్ మురిసిపోయాడు. వేదికమీదనుంచి దిగినతరువాత చాలమంది స్నేహితులతన్ని పరామర్శించారు. దేశికాదేవి గూడ ఏదో అనంతమైన భావార్థాన్ని స్ఫురింపజేసుకుంటూ అతనివైపు చూచింది. చిరునవ్వుచు లోలోపల దాచుకుంటూనే దాటిపోయింది.

# 7

సాయంత్రం అయిదు గంటలు గణగణ మని మోగినై, క్రిందటరోజునజరిగిన సభలు,వుపన్యాసధోరణులు, అందరి వ్యక్తులను గురించి, ఒక్కొక్క పదాన్ని గురించి ఒక్కోవిధంగా శంకర్ విమర్శ నా పూర్వకంగా మాట్లాడు తున్నాడు. రవి బాబు కవన్ని ఏం పట్టనట్లు ఏదో పరధ్యా నంలో వున్నాడు. అప్పుడతనికి కనిపించేది దేశిక నామం... ముగ్ధకుసుమాలలా ముచ్చటగావున్న ఆమాటలోని మూడక్ష రాలు అతనిలో తళుకుక్కునమెరిసినై. ఆరుమాసాల క్రిందట,

తెలయక మేడమీాదనుంచి నీళ్ళుపోసినందుకు మిగతావాళ్ళకి సభ్యత, సంఘమంటే ఏమిటో తెలియదన్న దేశికదేవి యీానాడు తను, ఆ రెంటిని గురించే ప్రసంగించినందుకు ముగ్ధురాలై సభ్యతంటే, ఏమిటో తనకు పూర్తిగా తెలుసని తప్పుకున్నట్లు ఋజువు కోసమే గాబోలు పూలదండ వేసింది ఎందుకోసం ...... ఆమె ...... చిరునవ్వుకూడ నవ్వింది ...

నావైపు చూడరా "రవి" నేను చెప్పేది విన బడటం లేదా అన్నాడు శంకరం. పరధ్యానంలో "రవి" ఉలిక్కిపడి ఏదో ఒక పెద్ద అణుంబాంబు పడట్టుగా కల వరంతో శంకరం వేపు దిరిగి "ఏమిటి నువ్వనేది" అన్నాడు.

"నీ మెళ్ళో పూలమాల వేసిన దేశికాదేవి ......"

"అవునవును ఆమె ... మన మేడక్రిందుండే ... "

"ఆమెరా నీకు జ్ఞాపకముందా మనకు సభ్యత, సంస్కారం లేదని ఏదో వెగటు మాటలు పల్కింది నీకు జ్ఞాపకముందా"

"ఆ ...... వుంది"

"నువు సరేనంటే ఒక పనిచేస్తా."

"ఏమిటి ... "

"ఈరోజింకోసారి నీళ్లు ... ... క్రిందకు పడేటట్లు పోద్దాము ... "

"పోస్తే" మనకొచ్చే లాభం ఎమిటంటావనాడు రవిబాబు.

"ఏమి ... లేదు ... యీారోజుగూడ పోట్లాట కొస్తుం దేమో చూద్దాం."

"ఈసారి వాళ్ళ నాన్నవస్తే."

"అరే ... ఆ మీసాలపోతునుచూస్తే నీ కెందుకంత భయం ?"

"కాదురా ... మనం అల్లరివాళ్ళ మంటాడేమో !"

"ఆసంగతి మనం పుట్టకముందే ఎవరో మహాను భావుడు అనుభవించి" విద్యార్థులు కోతులుఅని చెప్పాడు."

"సరే నీయిష్టం నేను మాత్రం పోయను బాబు ...

సరే నువ్వుండు నేనే వెళ్ళి రెండుగ్లాసులు నీళ్ళు పోసేస్తానంటు శంకరం కూజా వైపు వెళ్ళాడు. రవి బాబు సన్నగా చిరునవ్వుతో పెట్టిన ముఖాన్నద్దంలో చూచు కుంటూ ముసిముసిగా నవ్వాడు.

# 8

రవిబాబు ప్రసంగం దేశిక నౌకా నందానుభూతికల వరపెట్టినట్టుగావుంది, క్రితంరోజునుంచి ఆమెనేదో అగోచర శక్తి తన సర్వశక్తులతోను బేదిస్తోంది ఇంకోసారి రవిని కలుసుకుని క్షమించమని చెప్పుదామనుకుంది కాని, తనే సాహసించి అతని దగ్గరకు వెళ్ళి పలకరించితే యింటిపక్క నున్న వాళ్ళల్లె కధలెగాక, అతను, తనను బలహీనంగా

చూడవచ్చు. తననొక అసమర్థురాలిగా భావించితే ... ఆమె భావాలు ఆమెను మించిపోయినై. ఆమె పరిస్థితులు ఆమెకతీతాలయినై. ఆమె హృదయంలో కలిగే యీ సంక్షోభ సంరంభాల సంశయాలను తీర్చడం ... చల్ల గాలికిబయటకొచ్చి నిలబడివున్న దేశిక 'మీద ... నీటిధార పడింది. తలపైకెత్తిచూచింది. నేళ్ళు ... ఎక్కడనుంచి, మేడ మీద రవిగదినుంచే ... ఈసారామె నోరుమెదపలేకపోయింది. సిగ్గుతో బట్టలు మార్చుకోడానికి మారిపోయిన భంగిమతో యింట్లోకెళ్ళింది. రెండురోజులు యథాప్రకారంగానే గడచి పోయినై. ఎవరిపనుల్లో వారు ఎవరి చదువుల్లో వారుండటం వల్ల పాతవిషయాలు జ్ఞప్తికి అంటే బాహ్యానికి మాత్రం బహిర్గతం చేసుకోకుండానే గడిచినయన్నమాట.

# 9

ఒకనాడు శంకరం రవిని పిల్చినా రాకపోయినందు వలన తనొక్కడే సినిమాకు వెళ్ళిపోయాడు. శంకరం వెళ్ళిన తరువాతవొంటరిగా కూర్చున్న రవి హృదయంలో అలుము కొన్న విచారరేఖలలో లేక సంతోషరేఖలో, లేక యింకా ఏవైనా ప్రేరేపణా పూరితానుభూతులో తెలుసుకోవడం

సులువైన విషయం కాదేమో! ఎందువల్లనో చిరునవ్వు దరహాసించే పెదాలతో మెట్లవైపు చూచాడు.

ఎవరు ...

ఆమె...

కాదు, కాదు. ఆమె దేవలోకంనుండి దిగివచ్చిన రంభో - వూర్వశో ... ఆమె కాళ్ళకున్న అందియలు అమర నాధుని ముందు నాట్యమాడి అలసిపోయినట్లు రుజువు జేస్తాయి. అదీగాదేమో! మరియింకా బృదావనంలో గోపాలకృష్ణునితో సయ్యాటలాడిన ప్రధాన గోపికేమో! ఆమె భంగిమ, నాగరాణిని మించిపోవచ్చు, నిజమే నిజమే... నిజమే ... అదుగో ఆమె తలమీద నాగలోక రాజముద్రిక, ఆ ముద్రికతోనే తన ప్రధాన ఘట్టాలతో గూడిన పట్టుమీద ఆజ్ఞతోగాని అంజలితోకాని, శాశ్వతంగా చెరిగిపోకుండా వుండేందుకు ముద్రిస్తుందేమో! ఆమె పాదంతీసి పాదం పెడుతున్నపుడు నీడలోలికే ఆ అరికాలిని గాంచినపుడు "పారిజాతాపహరణం"లో సత్యభామ సునిశిత పాదాలను కృష్ణభగవానుడు వర్ణించటంకంటే యింకా ఎక్కువగా వర్ణించాలి. కాని ఆ కావ్యం వ్రాసిన నంది తిమ్మన్నలాటివాళ్ళో వుంటే వ్రాయవచ్చు ... వ్రాయడం కాదు. ఆశువులో చందోబద్ధమైన చంపకమాలలు చిటికలో చెప్పవచ్చునేమో!

ఆమెనీడ కిటికీ సందుల్లోనుంచి లోపలివైపునున్న అలమర ప్రక్కన, అరమరకలు లేకుండ అలంకరించి కలవరింప జేసింది. ఔను నిజంగా ఆమె ... ఎవరో? ... నాగ

కన్య ... కాదు ... రంభ ... అదీ గాకపోతే ... వూర్వశో మేనకో ... అయితే యిది నాగలోకమా? లేక అమర లోకమా? అయితే తను నాగరాజా .... ఇంద్రుడా? .... ఇంద్రుడయితే .... తనకు వెయికళ్ళు లేవే?

వెంటనే అతను వులిక్కిపడి ఏదో పరధ్యానంలో వుండి తన వూహాభవన నిర్మాణాన్ని పూర్తికాకముందే కాకలుదీరిన భవన నిర్మాణకర్తలను కూలదోసినవాడిలా, దోసిలితో ముఖాన్ని తుడుచుకుని ... మళ్ళీ అలమరవైపు మెట్లవైపు చూచాడు. లేదు ... ఇంతకుపూర్వం తను నిర్మించిన వూహాభవనంలో మెరిసిన కథానాయకి కనిపించలేదు. తను భ్రమించాడు తను చిత్రించిన వూహాభవనం కూలిపోయింది. తను చిత్రించిన చిత్రాంగి బొమ్మ గాలివీవనకు క్రిందపడిపోయింది. తనలో కృపలా పోగుచేసిపెట్టిన నిగనిగలాడే ఆమె సౌందర్యమంతా తళుక్కున మాయమయింది... తనే నేరం చేశాడః, వూహాసుందరి మాయమయింది... మరో అర్థగంట గడచిపోయింది. అంతు తెలియనగాధంలోపడి గిజగిజలాడుతున్న హృదయమేదో అనంత్యమైనా కాంతను నిబిడీకృతం చేస్తోందని, అందుకు నివాళి పల్కే తన వూహాసుందరి సౌందర్యపుముద్ద......అతను చదివే పుస్తకంలో కనిపించిందేమో! వెంటనే పుస్తకం మూసి మళ్ళీ దిక్కులు చూస్తూ వెర్రివూహాల గిలిగింతలలో పరవశత్వం పొందటం, పరమార్థానికి పరమ వ్యతిరేకమనేమో !

అదిగో యీసారామే నేమో నిజంగా మెట్ల మీద సవ్వడివస్తోంది. దిగ్గునలేచి మెట్లవైపు చూచాడు ......ఆమె ......... నిజంగా ...... ఆమె ...... ఎంత ధైర్యం ...... సంఘానికి, సభ్యతకి కట్టువడి పూపిరి సలపనీయని యినప గొలుసులతో బంధింపబడిన సాంప్రదాయం గల స్త్రీ ఒంటరిగావున్న బ్రహ్మచారుల్ని పలకరించడానికి రావడం... ఆమె భావాలు, నూత్నతంగా వుండవచ్చు, లేక ఆమె కామె అతీతురాలు కావచ్చు, కాని తను అభ్యుదవాదిని ......అంతమాత్రాన......ఆమె కాకపోయిన బ్రహ్మ చారులే......పలకరించబోయి పలవరించితే.......ఆమె దృష్టిలో వాళ్ళకేరకమైన స్థాన ముంటుంది. ఆమె అబలే కావచ్చు, ఏమీ నోటితో అనలేకపోవచ్చు. అంటే నిందా రోపణలు చేయకపోవచ్చును. కాని రోషంతో వెళ్ళి, యికిలించే సాంప్రదాయపు యినప సంకెళ్ళరవంలో తనుకూడ కలిసి, శృతి కలిపి చివరికన్యాయమై పోతుం దేమో. అప్పుడు తను మానవుడుగా చూపించవలసిన జాలైనా చూపించాలా?..............కాబట్టి.......... ఆమెలో వుండే ద్వేషాన్ని కొని తెచ్చుకునేదానికంటే ఆమెలోని నూత్నతాభావంతో పులకరించే భాష్యాన్నెందు కర్థం చేసుకోకూడదు. అందుకు సంఘమెంత బాధ్యత వహి స్తుంది. తన కనుగుణ్యమైన పాత్రను మాత్రం తీసు కుంటుంది. అందుకు ప్రతిఫలంగా, తనకు మద్దతులేని వారి పైన తన యినపపాదాలతో పాతాళందాకా తొక్కుతుంది అంతేనా......అంతె......

ఆమెదగ్గరౌతున్న కొలది అతనిలో అశాంతి ఆత్రుత ఎక్కువైయినయి. ముందామెను చూచి, పలకరించాలను కున్నది తనే, చివర కామెను చూచి భయిపడటముతనె... ఆమెనుచూచి భయంగాదు ...... పరిసరాలను చూచి మాత్రమె భయమని, అతని నగ్నభావార్ధంలో స్ఫురింప జేస్తుంటయి. ధైర్యవచ్చింది, పరిసరాలకు భయిపడటం మంటే బూజుపట్టిన సిద్ధాంతాలను భుజస్కందాల మీదె క్కించుకుని మోసినట్లే తనొకభ్యుదయవాది. అందు వలనే...తన భావాలను తనే స్ఫురించు కున్నాడు...... ఆమె...పైదాక వచ్చింది అతను, తన భావాలకు మరింత దగ్గరయ్యాడు. తనలో కనబడే న్యూనతను తను పరికించు కుని...దే...శి...కా...దేవి" అని గొణిగాడు. అవును ఆమె దేశికదేవే.

"రవిగారు ..." అన్నమాటలు అతనికూడ వినబడినై. వెంటనే లేచామెకెదురయ్యాడు, వాగ్ధోరణి కుపో ద్ఘాతం తెలియక తికమకలలోనే రెండు క్షణాలు, వడిగా పల్లంలోకిపోయె నీరులాపోయినై...

"మొదటిరోజుల్లో మిమ్ముల్ని పరార్ధం చేసుకున్నం దుకు క్షమించండి" అందామె...

"ఆ.......ఆ.......దానికేంలెండి.........అది మానవ సహజం."

"ఆ విషయాన్ని గురించి నా క్షమాపణ చెప్పి వెళ్దా మని వచ్చాను."

"దానికేం పర్వాలేదులెండి"...ముందు కూర్చోండి ......అంటూ రవి వాల్చివున్న మంచంమీాది దుప్పటి సరి జేశాడు. ముభావంగా ఆమె కూర్చుంది. అతనుగూడ కుర్చీని ఆమెకు కొంచెం దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు.

"మీా మిత్రుడింకో ఆయన వుండాలిగా......ఏడి" అని అడిగిందామె.

"అవును శంకరం...సినిమాకు వెళ్ళాడు..."

మీా రెందుకని వెళ్ళలేదు. మీాకు సినిమాలంటే యిష్టంలేదా! "అనడిగిందామె. అతను చిరునవ్వును దరిహసిస్తూ...యిష్టమే అయినప్పటికి ఎక్కువగా చూడనుట్లా"

అభూత రహస్యాన్ని తనలో దాచుకోలేని సిగు దొంతరల మరుగులో దాక్కున్నదానిలా ఆమె తనకళ్ళతో వ్యక్తంచేయగల దానిలా అతని వైపదోలా చూచి...

"నిన్న.........విన్న వుపన్యాసం చాలబాగుంది...."

"...................................................................................................."

"చిరునవ్వుతో అతను తల సవరించుకుంటూ దాని కేం లేండి....యదార్థమేగా. చెప్పింది....నేను చెప్పింది.... మీాకు నచ్చిందన్నమాట" అన్నాడు....

"నాకేగాదు....చాలమందికి నచ్చింది."

ధన్యుణ్ని.........

ఇద్దరు నవ్వుకున్నారు...ఆమె వెనకవైపున్ని తన జడను ముందుకు తీసుకుని లేచి నిలబడి" యిక నేను వెళ్తానండి" అంది.

"...................................................................."

"మా నాన్నగారు షికారుకెళ్ళారు వచ్చే వేళయింది నేను వెళ్ళాలి" అంటూనే ఆమె....బయలుదేరింది. గడప వరకు రవి గూడ ఆమెను వెంబడించాడు....

ఆమెొకసారి వెనక్కు దిరిగి అతనివైపు ఓరగంట చూస్తూ చిరునవ్వును ప్రసరింప జేసి....వస్తానండిఅంటు గబగబ మెట్లు దిగి వెళ్ళిపోయింది. ఆమె దిగబోయె ముందు....ప్రసరింప జేసిన నవ్వులో అంతరార్థం ?....

తను గూడ నవ్వాడు....

ఏదో వింతయినా నందాన్ననుభవించిన వాడిలా వెనక్కు దిరిగి మంచం దగ్గరకు వెళ్ళాడు....చేతిరుమాలు.... ఆమెదే ఆమె కూర్చున్నచోటునే........దొరికింది. పైకెత్తి చూచాడు....దానిమీద. "దేశిక" అని వ్రాసవుంది. తను గూడ ఆ పదాన్ని........"దేశిక" అని వుచ్చరించి మడచి డ్రాయర్‌లో దాచుకున్నాడు. ఎందుకు ?....అతనికే తెలియదు. బహుశ ఆమె దాన్ని మరచిపోయి వెళ్ళివుంటుందా? లేక వదలిపెట్టాలనే వుద్దేశంతోనే అక్కడొదిలేసి వెళ్ళిపోయిందా ? ఈ రెంటిలో దేనికి సమాధానమతని వూహా కందలేదు.

# 10

మళ్ళ వారంరోజులుగడిచేవరకు అన్నీ ప్రశాంతం గానే గడిచి పోయినై తరచు అప్పుడప్పుడు దేశిక, రవి యిద్దరు ఒకరొన్కకరు చూచుకోవడం తటస్థిస్తూనేవుంది.

ఒకనాడు కాలేజీ టయిమయిన తరువాత, యింటికి వచ్చే టప్పుడు తలవని తలంపుగా దారిలో యిద్దరు కల్సు కోవడం జరిగింది. అప్పుడే గనక మాట్లాడుకోవడం జరిగితే మరునాడు కాలేజి గోడలమీద వాల్ పోస్టర్లు అనేక భంగి మలలో అలంకరింప బడతాయి. గోరంతలు కొండంతలుగా మారి గోడలమీద కెక్కుతుందన్నమాట, అందువల్లనే గాబోలు ముందు తటపటాయించినా........... "ఇంటికి .... వెళ్తున్నావా దేశికదేవి" అన్నాడు....

"అ....ఔను రవిబాబుగారు....మీరు రావటంలేదా యిప్పుడు" అంది....

"నేను యింటికే...."

నేను వస్తానంటూ ఆమె రిక్షా ఎక్కి వెనకవైపొక సారి తిరిగి చూచింది. ఆ చూపులు....సునిశితమైన భాషలో ....అర్ధనిమీలిత నేత్రాలతో......అని పూర్వాంధ్రకవులు వాడినపదం...........రవికి బాగా తెలుసనుకుంట కాబట్టి తను గూడ.......పాలభాగాన్ని కదిలించుతూ ఎవరికి కనబడకుండ ఆమెకు మాత్రమే కనబడేటట్లు, వినబడేటట్లు, నవ్వాడు ఆలాపించాడు. అ దితమలకనూహ్యాం....తొలి చూపుల్లో

గల్గె ఆనందం కోటి సంవత్సరాల పంట. కొన్ని వేల సంవత్స రాలు ఆ జీవితాన్నావిధంగానే వుండ నియ్యమని భగవంతు నకు పంపే వేడికోలులో వుండే వెర్రి ఆనంద సుధారసపు ముద్ద. ఇంకా....భాషలో దొరకని....భావార్ధ సమ్మేళితం.... రవంగలపలేని రగద్ధూళితో నరాలలో వృద్ధ్భవించి, మాపు లలో వ్యక్తం చేయించి వింత ప్రవర్తనకు దారి చూపించేవి ........ఆ అనందాను భూతిలో వుండే అభూత రహస్యాం దోళనా సారాన్ని వర్ణించటానికి, నల్లించటానికి కోటి భాషలు చాలవు, కోటిరవాలు చాలవు. ప్రకృతి సామ్రాజ్య సమాజానికి సైన్యాధిపతిగా వుండి రక్షణ కల్పించినట్లు నియ మించబడిన మన్మధుని వెకిలిచేష్టలకప్ప. లేతచూపుల్లో కలిగే ఆనందమే అతనికి కట్టవలసిన కప్పం..అది కట్టకపోతే రచ్చకీడ్పిస్తాడు. కోటిగొంతులతో ఛీ! అనిపిస్తాడు. ప్రకృతి దేవి అమలుజరిపే ప్రతిశాసనానికి తల వొగ్గవలసిందేనని, జీవకోటి చెవుల్లో నూరిపోస్తాడు. నోరు మెదపనియ్యకుండ వుక్కిరి బిక్కిరి చేయటాని కావిరిపడ్తాడు....బలంగా నోరెత్తి గొణిగితే తన (పుష్ప) బాణాన్ని మంత్రించి వదిలిపెట్టి కల వరం పుట్టించి మనస్సును కలగూర గంపలా చేస్తాడు. యౌవ్వన సామ్రాజ్యంలో కునికిపాట్లు పడేవాళ్ళను కొర డాతో కొట్టి లేపి, కర్తవ్యాన్ని బోధించి, బాధించుతాడు. ........అతనికి బాస టవనివాళ్లు, వంతపాట పాడనివాళ్ళు, యింకా అతన్ని కొలవనివాళ్ళు....వుంటే పనికిరాని లోకం లోకి త్వరగా నెట్టేస్తానికి శిష్ట వేసుకుని కాపలాకాస్తాడు.

శంకరం యింటికి రాకముందే రవి యింటికి జేరాడు. తనో కభ్యుదయవాది. ప్రపంచంలో జరిగే ప్రతిమూర్ఖపు పనికి ఏదో ఒకరకమైన తృప్తిగలిగించేమారు పేరుంటుందని తెలుసుకున్న సూత్రకారుడు. తనెం తభ్యుదయ కారుడై నప్పటికి, తను సాధించాలని యత్నించే ప్రతికార్యాన్ని ఆధ్యాత్మిక, శక్తులచేత గూడ తేలికగా నప్పించగల తెలివైన వాడు....తను....ఎందుకంత....బాధతో గుమిలిపోవాలి.... తనలో గలిగిన భావాని కర్థం తెలుసుకోవటం తనవల్లగాని పనా? లేక తెలుసుకోగల శక్తుండి గూడ యింకేదైనా పదార్థాలపాలు........"బహుశ ఏదీగాని పక్షంలో" భయం "అయివుండాలి....కాకు మనోవ్యాకులత" భావాల కతీతు డయ్యాడు ముభావంగా వుండే దానికంటే మనోభావాన్ని మన్నికగా వ్యక్తీకరిస్తే....అర్థంకానివా డిలా కోటి ఆలోచనలతో కోటు తీసి ఒంకికి తగిలించాడు.

# 11

ఇంకో నెలకు వేసంగి సెలవులు రాబోతున్నాయి. అంటే ఫైనల్ పరీక్షలుగూడ దగ్గరపడినై యన్నమాట చదువు గూడ శాస్త్ర జాగ్రతగా, చదవలసిందిగూడ యీనెలే....

దాదాపు నాలుగు రోజులు నుంచి దేశిక కనిపించటం లేదు. కాలేజికి కూడ రావటంలేదు. ఎందువల్లనో మరి .... ఎవరి వల్లనో తెలుసుకుంటే.... "తనకు ఆరోగ్యం చెడి పోయిందిగాబట్టి నాలుగు రోజులు సెలవు కావాలని" కాలేజి ప్రిన్సిపాలుకు దరఖాస్తు పెట్టినట్లు తెలిసింది. మొదటరోజు డాక్టరు దేశిక వాళ్ళింట్లోకి వెళ్ళింతే ఎవరి కోసమోననుకున్నాడు. కాలేజికి దేశిక పెట్టిన శెలవును బట్టి చూస్తే ఆమెకే ఒంట్లో సుస్తిగావుండి వుంటుందని గ్రహించాడు. ఇప్పుడామెకెలావుందో! అసలేమి జబ్బో ఎవర్నడిగితే తెలుస్తుంది ......ఎవర్నిడిగితే ఎమనుకుంటారో ...... ఆమెకెలావుందోనని ప్రతిక్షణము అనుకునేవాడు. ఆమెను ప్రత్యక్షంగా చూడాలని తహతహలాడేవాడు. మరునాడు, తను కాలేజికి వెళ్ళే సమయంలోనే డాక్టరు ఎదురుగా రావటం జరిగింది. డాక్టర్నడిగితే తెలుస్తుందేమో ననే వూహతో ......బహుశ ఆమెకే జబ్బయి వుంటుంది ... ఆమె బయటికిరావడానిక్కూడ ......అంతబలహీనమైన రోగ మైతే తనకు కావలసిన సెలవు నాలుగు రోజులు మాత్రమే నని ఎందుకు దరఖాస్తు పెట్టివుంటుంది? యివన్నీ ఆలో చించుకుంటూనే డాక్టర్ని సమీపించాడు. తనేదో అడగ బోయేవాడిలా ......నోర మెదిపే యత్నంలో...డా ...... అనే పదం పూర్తవకముందే అతన్ని డాక్టరు చూడకుండానే గేటుదాటి లోపలికెళ్ళిపోయాడు. నిరాశతో రవి కూడ కాలేజీవైపెళ్ళిపోయాడు.

శంకరం పూరికెళ్ళేప్పటికి మూడురోజులయింది. అతనికూడ మారుతల్లె పాపం సొంత తల్లేనాడోపోయింది ఆనాటినుంచి మారుతల్లి గూడ శంకరాన్ని చాలా జాగ్రత్తగా పెంచింది. తన కెక్కడ సవత తల్లి జాగ్రత్తగా చూడలేదన పవాదొస్తుందో నన్న భయంతో శంకరాన్నామె నిద్రలేచినప్పటినుంచి మళ్ళీనిద్రపోయెవరకతనినికంటికి రెప్పలా చూచేది. శంకరానికూడ ఆమెమాటంటే ఎంతో గౌరవం ఎంతో భక్తి. అందువల్లనే, ఆమె కబురంపిందని తెలియగానే వెళ్ళాడు.

ఎన్ని ఆలోచనలున్న ఎన్ని ...రకాలైన వ్యధలున్న ...... అంటే బ్రహ్మచారులకేం వ్యధలుంటయి గనక ...... వుంటే గింటే ...అదీ ......ఏదోలే యిపుడెందుకా ...వృధా. యింటికివచ్చే టప్పటికి రవిని శంకరం కవ్వించి నవ్వించే వాడు. శంకరమంటే పెద్దవాళ్ళలో పెద్ద వాడు, చిన్న వాళ్ళలో చిన్నవాడు. నాస్తికత్వంలో ఆస్తికత్వంచూపించే వాడు ఆస్తికత్వంలో నాస్తికత్వం తరచి చూపించేవాడు. అందువల్లనే అతనికి దేవుడుండాడని కొందరు, లేడని కొంద రనుకునేవాళ్ళు. ఏది ఏమనుకున్నా అతనికి దేవుడుండాడనే చెప్పాలి. దానికి ఋజువు? అతని మంచానికి దగ్గరోగోడ మీదున్న మల్లిఖార్జునస్వామికి రోజు దండలెందు కేస్తాడు.

రవి కాలేజినుంచి యింటి కొచ్చి గేటుదాటబోతుం డగా ప్రొద్దునొచ్చిన డాక్టరే మళ్ళీ ఎదురయ్యాడు. యీసా రడుగుదామంటే ఆయన ప్రక్కనే దేశిక తండ్రి గూడ వున్నాడు. అసలాయన మీసాలు చూస్తుంటేనే పులి జ్ఞాప

కాని కోస్తుంది; ఒకవే ళడిగితే ఆయనేదైనా దురుద్దేశంతో తననొక నీచుడిగా భావించి తేనో అదీ ఒక కష్టమే ... అందు వల్లనే నోరు మెదపకుండా మెట్లెక్కి పైకెళ్ళిపోయాడు.

# 12

“రవి బాబూ” అని ఎవరో పిలచారని, నిద్రలో నుంచి త్రుళ్ళిపడి లేచాడు రవి ......కళ్ళు నులుముకుంటూనే ఎవరని గొణుగుతూ తలుపు గడియ దీసాడు. అతని కళ్ళొక సారిగా చెవులించినై ......ఆమె ...“దేశిక” తలకొక మప్లరు చుట్టుకుని వుంది ఆమె ముఖంలో కళాకాంతులు తగ్గినట్లుగా వున్నది ......ఎంత బలహీనం 4 నాలుగురోజులు జ్వరం వల్ల నరాలన్ని సడలిపోయినట్లుగావుంది. ఆమె రెండుకళ్లు అస్రుపూరితాలైవున్నయి ......బహుశ అవి ఆనందాశ్రువు లేమో! పెళ్ళికాని యువతి ...... ఆమెను ...... అనుకో కుండానే అతను ......ఆమెను కొన్ని సంవత్సరాలక్రిందట చూచిన వాడిలా ...తొందరలో ఏమి చెయ్యాలో పాలు పోకామె చేసిన ప్రయత్నంగా పట్టుకుని “దే ...శిక” అన్నాడు ......

ఆమెగూడ ......“రవి” ...బాబు ...అంది ...

"ఇప్పుడెలావుంది నీ ఒంట్లో"

"పర్వాలేదు...తగ్గినట్లే"

"ఏమిటా జబ్బు" అని ఆమెచేతిని నిమురుతూనే అడిగాడు...

"జ్వరం" మారి పోయినరవాన్ని సరిదిద్దుకుంటూ ఆమె బదులు చెప్పింది.

వాళ్ళిద్దరు చూపులు ఏవో రహస్యాలను తెలుసు కుంటున్నాయి...

ద్వంద్వహృదయాలతో సంభాషించుకున్నారు... సంభావనా పూర్వక సమ్మేళితాన్ని క్రీగంట చూపులలోనే పంచుకున్నారు.

మెట్లమీద సవ్వడి, వాళ్ళను మరోలోకంలోనుంచి భూలోకంలోకి తీసుకు వచ్చినట్లై..."ఎవరు"...అంటూనే లోపల కాలుపెట్టబోయె శంకరం...అర్థమయినవాడిలా వెనక్కాగి పోయాడు ..."తర్వాత" కలుసుకుంటానంటూ ఆమె ఏదో వృత్తాన్ని రవి చేతికిచ్చి ముసుగును సరిగా తలకు కట్టుకుని తలవంచుకునే దిగిపోయింది. ఆ మనతలకు దాటగానే శంకరం ...యీలపాట పాడుతూనే లోపల ప్రవే శించి, "రవి వ్యవహారం చాలాదాకా వచ్చిందే!" అన్నాడు ఆ మిచ్చిన వృత్తాన్ని శంకరానికి కనబడనీయకుండానే జేబులో పెట్టుకుని "అబ్బే ఏమిలేదు. శంకరం పాపం "దేశిక"కు నువ్వెళ్ళిన నాటినుంచి జ్వరం" అన్నాడు ...

"ఓహో ఆసంగతి నీకూ చెప్పే వెళ్దామని వచ్చిందా! అంతేలే...అంతే అయివుండవచ్చు, అంతకంటే ఏముంటుంది.

అయినా నాకెందుకు" అంటూ శంకరం ...రవి భుజాన్ని నిమిరి డ్రస్సుమార్చుకుంటూని కవతల కెళ్ళాడు. శంకర మలా మాట్లాడినప్పుడు రవి కేదో భయము, సిగ్గు రెండు ఏర్పడినై. శంకరమవతలి గదిలో బట్టలు మార్చుకునే సందర్భంలో తను ఆ వుత్తరం విప్పి చూచాడు.

"రవి బాబుకి ...

మీారభ్యుద మార్గంలో పురోగమించ బోతూకూడ తిరోగమన మార్గాన్ననుసరించడానికి యత్నించడం సహజ లక్షణాలుకాదేమో ... పరిస్థితులు, పరిసరాలు ఒక్కుమ్మ డిగా దండెత్తినప్పుడు వాటిని తట్టుకో గలిగిన మానసిక దళంవుందో కాదో చూచుకోవడం చాలా అవసరం. సమా జాని కుండేవి చాలావాడైన కోరలు. ఆ కోరలకాటు పడ కుండ వుండాలంటే...మార్గం?...అది మీారే తెలుసుకో వలసిన విషయం...మూడురోజులనుంచి నేను గనబడ నందు వలన మీారు చాలావిధాలుగా బాధపడ్తున్న విషయం, నిన్న సాయత్రం నేను మీారు కాలేజీనుంచి వచ్చే మేడమీాద కెళ్ళబోయేముందు లోపల కిటికీ దగ్గర్నుండి చూచాను. అప్పటి మీా పరిస్థితిని చూచి నాకేచాలా జాలిగల్గింది. అందువల్లనే పల్కరించి వెళ్ళడానికొచ్చాను. ఈ వుత్తరం యీా విధంగా వ్రాసినందుకు క్షేమించవలసినదిగా ప్రార్థిస్తు న్నాను.

ఇట్లు,
మీా శ్రేయోభిలాషిని
"దేశిక"

5

వృత్తరంలో వున్నది. ఏదో ఒక పెద్దగూడార్థ మన కుంటు ...అది ఏమయి వుండవచ్చును. పర్యవసానపు ఫలి తాలకు వుండే రూపు ... వాటి విలాసాలు ఏ రకమైనవ బంధానికి దగ్గరలోవున్నాయి అనే విషయాన్ని తరచి తరచి తనలో తనే అవలోకించుకుంటూ విలోకించుకుంటూ శంకరం రాకముందే వృత్తరాన్ని మడచి జేబులో పెట్టుకుని ఎదు రుగా వున్న మల్లిఖార్జునస్వామి పటంవైపు చూచి హృద యంలో నమస్కరించుకుంటు చూచాడు.

"ఏరా రవి ...దేవుడు వైపు దీనంగా చూస్తున్నావు కొంపదీసి కన్యలను వసీకరించుకొనే వరమివ్వమని అడుగు తున్నావా?" అని నవ్వుకుంటూ శంకరం రవి వున్నగదిలో కొచ్చాడు.

"శంకరం ...నీకు తెలియని విషయాన్ని ... తెలుసు కున్నవాడిలా కనబడుతూ ఎందుకలా మాట్లాడతావు. నీకేమి తెలియదు ...నువ్వూరుకో"

"కాదు ...రవి... నేనన్నమాటలకు నీకేమైనా బాధ గల్గిందేమో నీకు బాధ గల్గించాలని గాదు నా వుద్దేశం. చిన్ననాటినుంచి వున్న మన మిత్రుత్వపు చొరవవల్ల మాత్రనే అలా అన్నాను...బహుశా నాకంటే కూడ నీకు కొన్ని...కొన్నేమిటి చాలా విషయాల్లో అనుభవం వున్నది. కాని...ఆలోచించు రవి...నువ్విలా ... ఎంత స్నేహమున్నప్పటికి పెళ్ళికాని యువకుడివి మరో పెళ్ళికాని యువతితో చొరవగా ప్రవర్తించడం, మంచిదిగాదేమో.

అది ఏ రకంగానైనా పరిణమించవచ్చును. సంస్కృతి, విజ్ఞానం, సభ్యత అంటే ఏమిటో తెలుసుకున్నవారు ...దారి దప్పినప్పుడు ... నీ మీదుండే అనురాగంవల్ల నేను మందలించటమేగాదు. లోకమంతా కోడై కూస్తుంది. నీకు బాధ లేకపోవచ్చు నీతో ఆమెకు మీదు మిక్కిలి పరిచయమున్న దన్న సంగతి లోకులకు తెలిస్తే దేశికకు పెళ్ళవుతుందా? ఆలోచించు ... ఏ మనిషికి అపచారం చేయకూడదనే నీ సిద్ధాంతాన్ని నువ్వే ఖూనిచేస్తావా? పోనీ నీకంత మమకారమూ ఆమె మీదుంటే పెళ్ళి చేసుకోవడానికూ్యడ వెనకాడని పరిస్థితుల్లో వుంటే ... బాధలేదు ... మీ యిద్దరు యిష్టపడి నప్పటికి ముందు మీ నాన్నగారి సంగతి చూడు. ఆయన ససేమిరా ఒప్పుకోడు. అప్పుడు చేయవలసిన పనేమిటి ఆలోచించుకో ...బాగా ..."

"అవును శంకరం; నాన్ననుకూడ నప్పించగలిగితే - అసలు "దేశిక" వప్పుకుంటుందా? ఆ మొప్పుకుంటే ఆమె తండ్రొప్పుకుంటాడా?"

"నీకేరా లక్షాధికారి కొడుకువి ...అదీగాక, చదువుకున్నవాడివి ...తప్పకుండ వప్పుకోవచ్చు ...కాని మీనాన్న ఒప్పుకుంటాడంటే నాకుమాత్రం నమ్మకంలేదు" "ఆయ నొప్పుకోకపోతే రిజిస్టరుపెళ్ళి చేసుకుంటాను."

"చాలా పొరబాటు పడ్తున్నావు రవి. పాతకాలపు సిద్ధాంతాలకు స్వస్తిచెప్పాలని నువ్వెప్పుడప్పుడంటుండేమాటలలో కొన్నింటితో మాత్రమే నేనేకీభవిస్తాను నిజానికి పాత

కాలపు సిద్ధాంతాలు కొన్ని చాలామంచివి చూడు రవి ... ఒకప్పుడు నువ్వు ...మీ తల్లి తండ్రుల శరీరంలో ఒక రక్త బిందువు ...మాంసలో మాంసపు ముద్దవు ...వాళ్ళ రక్తంలో రక్తం యీ నాడు వాళ్ళనే ఎదిరించిందంటే వాళ్ళెంత క్షోభించి పోతారో తెలుసా? అదిగాదు. అటు వాళ్ళకి బాధగల్గించకుండ యిటు నీ హృదయాన్ని దహించుకో కుండ వుండే మార్గ మింకోటాలోచించు....అప్పుడు యే బాధలేదు." అదంతా చెప్పి శంకరం మౌనంగా రవి వైపు చూస్తూ కూర్చున్నాడు.

ఇదంతా విన్న రవి శంకరంవైపు చూడలేక పోయాడు.

# 13

రెండురోజులు గడిచేటప్పటి కామెజ్వరం పూర్తిగా నయమయింది - కాలేజీకికూడ వెళ్ళింది. జ్వరం నయ మయిందన్నమాటేగాని, ఆమెలో పూర్వమున్న ఉత్సాహం, కళ యింకా పూర్తిగా రాలేదనే చెప్పాలి.

సాయంత్రం మాములు టైముకే రవిబాబు.... .... "దేశిక" ముందుగా రిక్షాలో వచ్చిందని తెలుసుకుని

వేగంగా తను గూడ ఇంటికి జేరాడు....ఇంచుమించు శంకరంగూడ...అతన్ని వెంటాడుతునే వచ్చాడు. అతని వుద్దేశ్యంకాదు. రవి వలె అత నే వుద్దేశాన్ని తనలో వుంచుకుని కుమిలిపోవడం లేదుగాబట్టి అతను ఆటలంటే చాలా హుషారుగా వుండేవాడు. రవిని గూడ రమ్మని ఎన్నిసార్లు చెప్పినా! "నేనురాను చదువుకోవాలనో, లేకపోతే తల నొప్పిగా వుందనో యింకా అనేక సాకులతో వెళ్ళేవాడు గాదు. అప్పుడు శంకరుగూడ అతన్ని కదలించ కుండానే వెళ్ళిపోయేవాడు. అందువల్లారోజున గూడ రవిని రమ్మని చెప్పకుండానే అతను క్రికేట్ సామాగ్రి చేతపట్టుకుని తన దారిని తను వెళ్ళిపోయాడు. శంకరం వెళ్ళిపోయినర్ధగంట వరకు రవి తన దృష్టి దృక్పదాన్ని శూన్యాకాసంలో విన్యాసం చేయించాడు. అతని భావాలు అతని కతీతాలని శంకరానికి మాత్రం పూర్తిగా తెలుసు.

"అతని ఆలోచనా మందిరంలో అంతరాయం కలగటానికి కారణ మామె ప్రవేశించి స్వేచ్ఛగా విహరించ డమే నేమో!....అతని వూహానగరంనుంచతను యధాస్థికొచ్చేటప్పటి కామతనిముందు ప్రత్యక్షమయింది. నిజంగా ఆమెనా...."దేశికా" నీవేనా అనుకుంటూ అతను....ఆమె దగ్గరగా జేరిదే....శికా "అన్నాడు...."

"ఆ - ఏం రవిబాబు - వంట్లో ఆరోగ్యం సరిగా లేదా."

"అబ్బే - నాకేం సుస్తీలేదు. బాగానే వున్నానుగా"

అంటూ అతను తన్ను తాను జాలిగా సంబాళించు కున్నాడు.

"లేదు మీలో ఎందునల్లనో చాల బలహీన తేర్ప డింది" అందామె.

అతను యింకొంచెమామెకు దగ్గరగా జరిగి "దేశికా. నిన్ను నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను" అంటూనే తన కళ్ళతో గూడ తనలోనుంచి పొంచి చూస్తున్న...ఆవే శాన్ని వింతగా తెలియజేస్తున్నట్లుగా గోచరింపజేశాడు.

ఆమె అతనికి కొంచెం దూరంగా జరిగి కూర్చుని.... ఏదో చెప్పబోయి మళ్ళీ ఎందుకనో ఆగింది.

"దే....శికా" అన్నా డతను.

"రవిబాబూ!..."

అతని చెంప పెళ్ళుమని మోగింది. బిందువులు, తన కాఠిన్యాన్ని పర్యవేక్షించి, పర్యవసానమిదేనా? యని అడిగినట్లూ ఆమె రెండుకళ్ళల్లోనుంచి రెండు దుఃఖపూరిత బిందువులు రాలినై. తనొక భ్యుదయ వాదయివుండి గూడ క్షణికమైన దానికోసం పశుత్వానొలక బోయడం కంటె త్రవ్వి తీసుకున్న గోతిలోపడి తనువు చాలించడమే మంచిదా?... అదేనాని తనొక విజ్ఞాని, చదువుకున్నవాడు సంస్కారం సభ్యత యివన్నీ వెన్నలో బెట్టిన విద్యలా అబ్బించుకున్న వాడు...పొరపాటుబడటం మానవలక్షణం, తను చేసినది పొరబాటని తెలుసుకున్న తరువాతైన పశ్చాత్తాపపడి,

ప్రాయశ్చిత్తం చేసుకుని విముక్తుడైతే బాధలేదు. అప్పుడు తను సమాజం దృష్టిలోను, దైవదృష్టిలోను గూడ మానవుడనిపించుకుంటాడు.

ఆతని వైపు చూడటాని కసహ్యించుకుంది. అంత మాత్రాన...ప్రజోపయోగి కాకుండా పోతాడా? నిజానికి తను మంచివాడే...కాని శారీరకంగా, తనోతుచ్ఛమైన, తృణప్రాయమైన దావాగ్ని కాహుతయ్యే పరిస్థితిలో... ఆమె తనకి విజ్ఞానాన్ని ప్రసాదించింది. ఈనాడతను శారీరక బలహీనతకు లొంగి పోవచ్చును అంతమాత్రాన తను దేశానికి రేపైనా వుపయోగ పడక పోతాడా?

ఆమె హృదయం సంక్షోభించింది, అందువల్లనే గాబట్టి "రవిబాబు..."ఇది విజ్ఞానం, సంస్కారం పొందిన సంఘుసేవాభిలాషికి తగినపనిగాదు, నిన్ను నేనొక అమర్యాదుడుగా మాత్రమే భావిస్తున్నాను. తను ఎక్కువగా ప్రేమించిన పుష్పాన్ని చేతులతో చెట్టునుండి తృంచి పరిమళాణ్ణా ఘ్రాణించేదానికంటే చెట్టునేవుంచి స్పర్శకూడ లేకుండ దాని అందాన్ని చూచి దూరంగావుండే ఆఘ్రాణించడంలోనే గొప్పదనంవుంది. రెండో విషయమేమంటే; ప్రకృతిలో సహజంగా యాచరించబడే రెండు జాతుల సహాజాన్ని ఎన్నిరకాలుగానో వుపయోగించుకుండటం జరుగుతోంది. అది సద్వినియోగం కోసం జరిగితే సంఘుసేవా దృశ్యంగా చేసి చూపించినట్లే, స్త్రీతో స్నేహం చేయడమంటే యిందుకేనా!...స్త్రీకి ఎంతో విలువ యివ్వాలని

తెలుసుండిగూడ...ఒక్క సారాలోచించుకో! నీ మాతృమూర్తిగూడ ఒక స్త్రీ ...అని మాత్రం జ్ఞప్తించుకో...... స్నేహం చాలా విలువైనది. దానికి విలువగట్టడం...జరిగితే వెర్రి వూహాలతో ఎంతగా కులికినా సంఘుద్వేషే గాదు...అంతకంటే కూడ పతనం జరగటం ఖాయం"...

ఆమె నోటంట మాటరాలేకపోయింది కంటినీళ్ళు తుడుచుకుంటూనే ఆమె చరచర మెట్టుదిగి, వెళ్ళిపోయింది. ఆమె నేదో పలకరించా లనుకున్నాడు. ఏమో చెప్పాలనుకున్నాడు....కాని ఆమె వినకుండా వెళ్ళిపోయింది..పోతూ.. పోతూ....తను మర్చిపోబోతున్న కర్తవ్యాన్ని జ్ఞాపకంజేసి మరీ వెళ్ళిపోయింది. దానర్థం ఆమెలో తనలో పవిత్రిస్తానముంది గాబట్టే....ఆవిధంగా చేయగలిగింది....తనలో గూడ నిజమైన మానవత్వం వుందని రుజువుచేసుకుంది.

# 14

ఆనాడు దేశికద్వారా తను నేర్చుకున్నది మంచే .గావచ్చు అందువల్లనే తను యీనాటికి ఆమె నేరకంగానో....చాలా వున్నతస్థాయిలో గౌరవించుకున్నాడు.

ఆ సంగతి ఆమెకు తెలియకపోవచ్చు. ఆ మిప్పుడు తనకు చాలా అజ్ఞాతంగానే వుంది.

శంకర్ కి వేసవిలోనే పెళ్ళని తనుగూడ చాల సంతోషించాడు. తన మిత్రుడొక గృహస్తవబోతున్నాడు. సాంఘిక ధర్మాల ననుసరించడానికో లేక అధిగమించడానికో దేనికైనప్పటికి సంఘంలో అతనొక విధమైన గౌరవ ప్రతిపత్తిని నెలకొల్పుకోబోతున్నాడు. తన జీవితానికొక భాగస్వామిని తెచ్చుకో బోతున్నాడు అని రవి బాబు చాల సంతోషించాడు. శంకరం వివాహ విషయం, తెలిసిన మర్నాడే శంకరంగూడ వూడిపడ్డాడు. ఇద్దరు మిత్రులు చాల సేపు ముచ్చటించారు. దానిఫలితం రవిబాబు పూర్వంకంటే గూడ చాలవున్నతస్థాయిలో వున్నట్లు శంకరంగూడ గ్రహించాడు.

శంకరం పెళ్ళి సంగతిచెప్పి, శుభలేఖ యిచ్చి రావడానికి రవి శంకరులిద్దరు దేశికాదేవింటికెళ్ళారు. దేశికను చూచి ఇప్పటికి దాదాపు సంవత్సరం కావచ్చింది ...ఆమెకూడ వివాహమయిందేమో ... వివాహమయితే ఆమె పల్కరిస్తుందా ? ఇంకా ఎన్నో రకాల ఆలోచనలతోనే యిద్దరు ... తాము చదువుకునే రోజుల్లో వుండే మేడదాకా వెళ్లారు...కాని యీ నాడా మేడ చాల బోసిపోయి వుంది. ఎందువల్ల ? ... రవి శంకరులు లేరనా ? లేక దేశికదేవి లేదనా? అనే అనుమానము ఎరిగి ఎరగనివాళ్ళనుకునేంత వ్యంగ్యంగా వుంటుంది. ఇద్దరు లోపల ప్రవేశించేసరికి ఎవరో ఆ యింట్లో మరొకరు కనిపించారు...బహుశ వాళ్లు చుట్టా

లయి వుంటారేమో అనుకుంటూనే మరికొంచెం ముందు కెళ్ళి, "దేశికాదేవిగారున్నారా?" అని శంకరం ప్రశ్నించాడు.

ఆయింట్లో కనుపించినావిడే తలుపుచాటుకెళ్ళి ......
"తెలియదండి" అని ముక్తసరిగా జవాబు చెప్పింది:

"అయితే వాళ్ళిప్పుడెక్కడుంటున్నారండీ"...అని రవిబాబుగూడ వెంటనే మరోసారి ప్రశ్నించాడు.

"మీారనే దేశికాదేవంటే...క్రితంసారి మాకంటే ముందీయింట్లో వున్నవారి తాలూకాయేనా!...అనడిగిందామె."

"అవునండి" ఇద్దరు ఒకేసారి బదులు పల్కారు.

"అయితే...ఎవరోగాని క్రితంసారి యీా యింట్లో వుండే ఆఫీసరుగారు చనిపోయారట అందువల్ల, ఆడంగులు పూనా వెళ్ళిపోయారని మాత్రం తెలుసు."

చనిపోయి ఎన్నాళ్ళయిందండీ అనడిగాడు శంకరం. ఆడంగులు వెళ్ళిపోయి ఎన్నాళ్ళయిందండి అని అడిగాడు రవిబాబు.

"ఎన్నాళ్ళయిందో గూడ మాకు సరిగా తెలియదండీ...మేమిక్కడికొచ్చిన తరువాత మాకు పొరుగువాళ్లు చెప్పారు...అంతే."

"అయితే ఆడంగులు పూనా వెళ్ళిపోయారన్న మాట."

"అవునంటండీ"

"ఆఫీసరుగారు ఏం జబ్బువల్ల మరణించారో తెలుసండీ మీకు ?"

"రక్తపోటువలన చాలాసార్లు బాధపడ్డారట, తరువా తొకనాడు తీవ్రమయినందువలన పోయారట పాపం."

ఇంకా ఏమైనా వివరాలు చెపుతుందేమోనని యిద్దరు గడపవైపే చూస్తూ నిలబడి వున్నారు.

"వాళ్ళు మీకు బంధువులా" అనడిగిందామె.

"లేదు...అంతకంటే విలువైన స్నేహం మాత్రమే వాళ్ళకి మాకు వుందన్నాడు రవిబాబు. "నమస్తే" అని యిద్దరు...ఒకేసారి గేటు దాటారు.

ఒకానొకనాడు...ఈ యిల్లు దేశికా దేవివల్ల ఎంతో కళకళ లాడ్తుండేది. ఈనాడు పూర్తిగా బోసిపోయింది. ఆనాటి రోజుల్లో ఆమె నిండు యవ్వనప్రపూర్ణపు సౌందర్యాన్ని కబళించడానికి ప్రతిరేయి చంద్రుడు ఆ యింటి ప్రాంగణంలో తన కాంతినంతా విరజిమ్మే వాడా యన్నట్లుండేది. కాని యీనాడు అవన్ని లేవు...కారణం... విధి వ్రాతనుకునే బదులు జీవితగమన మార్గపు మైలురాళ్లు, కొన్నెయినా తగ్గి...గమ్యస్థానం దగ్గరైనట్లుగా ఎందుకు భావించగూడదు.

# 15

శంకరం పెళ్ళయి నాలుగు నెలలయిపోయింది. యధా తథంగానే. అన్ని కార్యాలు జరిగిపోయినై. రవిని కూడ పెళ్ళిచేసుకోమని...ఎప్పుడూ చెబుతుండేవాడు. రవి గూడ అవన్ని విని విన నట్లూరుకునేవాడు...ఆనాటి రవికి యీనాటి రవికి ఎంతో తేడావుంది. కాని...ఆనాటిది, యీనాటిది భావగర్భితాభ్యుదయ జ్ఞానం మాత్రం ఒకటే. ఒక విషయం. ఆనాటి చదువునే రోజుల్లో వుండే అభ్యుదయ వాదాభిభాషణ విప్పి చెప్పినట్లుగా వుండేది. కాని యీనాటి భావాలు...ఆనాటివే ఐనప్పటికి కొంచెము భావగర్భితంగా వుంటయి. కారణం? మితభాషిగా మారి తదనుగుణ్యమైన పద్ధతినెప్పుడూ అంటే విరామం లేకుండా తనలోతనే సంస్కరించుకోవడం వల్లనే నేమో!

పెల్లుబుకే అతని భావాలకు ఆదరాన్ని...యింకా ఏదో యింకోరకమైన అనుభూతిని దేశికాదేవి అంకితంజేసింది. ఆమెచెప్పిన ప్రతి అక్షరాన్ని యీ నాటికి మననం చేసుకుంటూనే...పురోగమిస్తున్నాడు. యింకా పురోగమిస్తాడు గూడ.

అతని వేషం పూర్తిగా మారింది. భాషలోగూడ మృదుత్వమైన సంవాదమేర్పడింది. అంటే పూర్వాంకంటె మెరుగని మాత్రమే, దానికే యింకో అర్ధముంది అదే తనొక వ్యక్తయ్యాడు. వినమ్రత శోభతో విరజిమ్మే అతని

భావాలు మరింత విస్తృతమై వివర్ణ పర్ణములతో వెలవెల
బోయె హృదయాలకావులింపులు కలుగ జేస్తున్నయా
యన్నట్లుగా గోచరిస్తున్నయ్యన్నమాట. ఇప్పుడు అంటే
శంకరం పెళ్ళయిన తరువాతిద్దరికి ఎడబాటు సంభవించింది.
స్నేహ మెంత చిరస్థాయియైన దైనప్పటికి...యిద్దరుకొంచెం
దూరంగా వుండటం మాత్రం తప్పలేదు. చిన్నతనపు రోజు
ల్లోను, చదువుకునే రోజుల్లోను రాసుకు పూసుకుని తిరు
గుతూ ఏవో ప్రొద్దుపోని వూసులు చెప్పుకుంటూ తిరిగే
రోజులు సంసారాలు వెలగబెట్టే టప్పుడుగూడ కావాలంటే
ఎలానస్తవి. అందుకు ముందు యిల్లాళ్ళుగూడ యిష్టపడా
లిగా, మరికొంతమంది గృహిణులైతే భర్తయిల్లుదాటవతలకు
పోతే చాలు, ఏదో కొంపమునిగిపోయినట్లుగానే భావిస్తారు.
ఒకవేళ, భర్త నెక్కువగా ప్రేమించేవాళ్ళకదాక అలవా
టేమో! లేకపోతే...ఏదైనా ఒకనుబంధ సమస్యయినా
అయివుండాలి. కొంతమందతన్నిచూచి పిచ్చి పుట్టిందను
కున్నారు. మరికొందరు వెర్రున్నదన్నారు. యింకా కొందరు
చాదస్తమన్నారు. పోని తనకేమి లేవని రుజువు చేసుకో
వాలంటే అతను వారి కనుగుణ్యముగా వర్తించాలి
గాబోలు. మతిపోయిన సంఘానికి మతెక్కడుంటుంది. తనను
విమర్శించనివాడు అంటే తన తప్పులను ఎత్తిచూపించని
వాడుంటే వాడసమర్థుడనుకుంటుంది. లేక తనుజేసే పొర
బాట్లను సాదృశ్యంగా చూపించగలిగితే రాడీ క్రింద లెక్క
వేసి తనదృష్టిలో ఆనిజమానవుడికి ఒక నీచాతి నీచ మైనస్థానం
కల్పించుతుంది. ఈ రెండింటిలో ఏదీ చేయకుండ వుండే

మానవుడుంటే వాడికి వెర్రి, పిచ్చి, చాదస్తం యింకా ఏవో వెధవసాకులు పెట్టి పిలుస్తుంది. ఇలాంటి గతి లేని సమాజాన్ని పట్టుకుని వేలాడే దానికంటే దిక్కు లేని చావు చావటం కోటిరెట్లు నయం. అదీ చేయకూడదనుకుంటే... ఎదిర్చి పోరాడడమే మంచిది. అంటే దానర్థం రవి అసమర్థుడనా? కాదు...కాదు...సమర్థతవుండి గూడ సమయిస్ఫూర్తిగావుండే సాంఘిక విజ్ఞానాన్ని సాదృశ్యంగా వినియోగించలేక పోవడంవల్లనే. అదిగాకపోతే...సాంప్రదాయపుబండెల దొడ్డిలో బంధింపబడి ఆశయమనే...యజమానికోసం గిలగిల లాడటమన్నా అయివుండాలి. ఏదీగాకపోతే...మరింకేదయివుండాలి.

# 16

రవికి మానసికంగా సంతోషం వున్నప్పటికి, అతని ఆశయాల కెప్పటికప్పుడు ఓటమి తప్పడం లేదన్న విచారం వుండటంవల్ల ఏదో ఆలోచనతో వుండేవాడు. ఏదో చప్పుడు విని గదిలో చదువుకునే రవిబాబు తలుపువైపు దిరిగి చూచాడు. వెంటనే లేచి నిల్చున్నాడు గౌరవప్రదంగా.

"రవీ..." అని పిల్చాడు.

"ఏం నాన్నా..."

"నాకు ఒంట్లో ఆరోగ్యం సరిగా లేదు. అందువల్ల సూరత్ ప్రయాణమాగిపోతున్నాను. అక్కడ షాపు వ్యవహారం చూడటానికి నువ్వెళ్ళిరా! కావాలంటే నీకు తోడు శంకరాన్ని గూడ తీసుకెళ్ళు."

"వెళ్తాను...కాని శంకర మిప్పుడు వాళ్ళింటిదగ్గిర లేడు మొన్న దసరాకి అత్తగారింటి కెళ్ళాడు. యింకా తిరిగి రాలేదట."

"పోనీ నువ్వొక్కడివే వెళ్ళిరా"

"సరే..."

"ఇంకో మాట"

"ఏమిటి"

"ఏ రోజుకారోజు నవరసు ధర ఏలావున్నది నాకు తెలియజేస్తూ వుండు...."

"సరే...."

"అయితే నువ్వు రేపే వెళ్ళాలి....మీ అమ్మదగ్గిర కూ్కడ వెళ్ళొకసారి చెప్పిరా...." అంటూ చంద్రశేఖరం గారు క్లబ్బువైపెళ్ళిపోయారు. రవిబాబు తల్లిదగ్గిరకెళ్ళాడు... విషయాలన్ని చెప్పడానికి.

"అమ్మా....అమ్మా...."

ఏం బాబు....అంటూ లోపలినుంచి వచ్చింది.

"రేపు నన్ను నాన్నగారు మన నగలషాపు సూరత్ కి వెళ్ళమన్నారు."

"తప్పకుండా వెళ్లినాయనా.... మేమూ అంటే ముసలి వాళ్ళమయిపోయాము. వ్యాపార విషయం నీకింతవరకు ఏమీ తెలియదు.... ఎలా బ్రతుకుతానో ఏమో మరి.... అన్నిటికి ఆ భగవంతుడే వుండాడు. వెళ్ళితే వ్యాపారానుభవం గూడ వస్తుందిగా".... అందామె.

# 17

సద్భావ గర్భిత సమస్యలను పరిష్కరించుకుంటూ స్ఫురించుకుంటూ సూరత్ నగరంలో తన జీవితం వ్యాపారానుభవ పూర్వకంగా గడపపడం మొదలెట్టాడు. స్వంతంగా తల్లి దండ్రులకు దూరంగా వుండి జీవించడ మతనికిదే మొదటిసారయినప్పటికి...అన్నిపనులు మేనేజరు చూస్తూ వుంటాడు. తను ఏదో ఒక సంతకం పారేసి వెళ్ళిపోయేవాడు. ఏమిటతని ధ్యేయం? ఎందువల్ల తనుభవితవ్యానికి పురోగమించలేక తికమకలు పడ్తున్నాడు, కాలం లోకం వివరాలతే పని లేకుండానే దొర్లిపోతోంది. సంవత్సరంరోజులు అనుకోకుండానే గడచిపోయినై. దాదాపు రవి శంకరులు కలుసుకుని, తియ్యందనాల మాటలు మాట్లాడుకునిప్పటికి దాదాపు సంవత్సర మయిపోయిందన్నమాట. రవిప్పుడు

కాలగతాన్ననుసరించి పూర్తిగా వ్యాపారంలో దిగిపో యాడు...ఏరోజెంత లాభమో, ఏరోజెంత రేటు నవరసు ధరుండేది వివరంగా రోజూ తంతిద్వారా తెలియబర్చుతుండే వాడు. ఆ రోజు ఆఫీసులో ప్రవేశించాడో లేదో...వృత్త రాల కట్ట బల్లమీద గమనించి, ముఖ్యంగా శంకరం దస్తూరి తనకు బాగా తెలుసుగాబట్టి ముందావుత్తరమే విప్పాడు.

హైదరాబాదు,

"ప్రియరవిబాబుకు మీస్నేహితుడు శంకరం దీవించి వ్రాయునది. నేను యిచ్చట క్షేమములు. నీ క్షేమములు గూడ తెలియబర్చవలయును. నువ్విప్పుడు పూర్తిగా వ్యాపారంలో దిగి అపూర్వానుభావాన్ని గడిస్తున్నందుకు నాకెంతో సంతోషంగావుంది. నేనుగూడ ఏదైనా వ్యాపారం చేయాలనే వుద్దేశంతోనే వున్నాను. కాలం ఎప్పటికప్పు ఎదురవటంవల్ల యింతవరకు దేనిలోను ప్రవేశించలేక పోయాను. అన్నట్టు అసలుసంగతి మర్చిపోయాను. మాకిప్పు డొకబ్బాయి పుట్టాడు. యిప్పుడే మమల్ని ఏడి పిస్తున్నాడు ... తరువాత తరువాత, నీకంటే గొప్ప అభ్యు దయవాదయి పోడుగదా అనిపిస్తుంది. నువుగూడ తొందరగా పెళ్ళి చేసుకుని వెంటనే ఒకమ్మాయిని మావాడికోసరమైనా కనాలి. జాగ్రత్త. కనీసం మావాడికోసమ్తైనా నువ్వాపని చేయవలసి వస్తుంది. దయయుంచి యికనైనా పెళ్ళిచేసుకో కూడదనే పాతవేదాంతాన్ని కట్టిపెట్టి వెంటనే గృహస్తుడ వవ్వాలని ఆసిస్తున్నాను. దీవిస్తున్నాను. మా లక్ష్మికి

(మీ చెల్లెలికి) ఆరోగ్యం సరిగాలేదు ... ఆరోగ్యం చేకూరిన తరువాతొకసారి నీ దగ్గరకు నీకు కాబోయే అల్లుడితో సహా వస్తాము. అప్పుడు లక్ష్మిని నీకు తప్పకుండా పరిచయం చేస్తాను. నీ సంగతంతా ఆమెకు చెప్పానులే ... ఎప్పుడు నీ విషయమే చెప్పి నవ్వుకుంటాము. పెళ్ళినాడు నిన్ను చూచిందటగాని ...యింత, సమర్ధుడవనుకోలేదట అందువల్ల పరిచయం చేస్తాను. జవాబు వెంటనే వ్రాయలెను.

ఇట్లు
నీ ప్రియమిత్రుడు
శంకరం.

వుత్తరమంతా చదివి రవిబాబె చిరునవ్వు నవ్వుకున్నాడు. వెంటనే జవాబుగూడ రాసేశాడు.

# 18

దేశిక పూనా వెళ్ళినతరువాత B. A. పూర్తి చేసింది. పూర్వం తన తల్లిగారివూరు సర్దార్ పేట...అంటే అదొక చిన్న పల్లెటూరు. ఆ వూళ్ళోనే తల్లికి కొద్దిగా పొలముండటంవల్ల పూనానుంచక్కడకు వెళ్ళిపోయారు.

ఆమెకో మేనమామగూడ వుండాడు, గాని ఆయనేమంత చదువుకున్నవాడుగాదు. అమాయికంగా వుండేవాడు. అయినప్పటికీ అతనికేయిచ్చి దేశికను పెళ్ళి చేయాలనామె తల్లి తలంపు. అతనుగూడ పెద్ద అందగాడు కాకపోయినా వికృతంగా మాత్రం వుండడు. సంసారవిషయాల్లోను పశువులను జాగ్రత్తగా చూడటం, పొలంవిషయాలు యివన్నీ ఆతని ప్రీతి పూర్వక సమస్యలు. అతని పేరు ముఖర్జీ. పేరెంత ముచ్చటగా వుందో అతని పనులంత మొరటుగా కనిపించేవి దేశికాదేవికి. అతన్ని బావా అని పిలవాలంటే ఆమెకు ప్రాణకంటకంగా వుండేది. అతనితో ఏదైనా అవసర సమస్యను గురించి చర్చించాలంటే "ఏమండీ" అని తరచూ పిలుస్తూ వుండేది. ఎవరైనా ఎప్పుడైనా ... ఏ పొలందగ్గరో ఏ పెరట్లోనో ముఖర్జీని చూచినప్పుడు "నీ అదృష్టంరా"... అంటే...నవ్వుకుంటూ వెళ్ళిపోయేవాడు. ఆమెను పిలవటానికిగాని, ఆమెతో మాట్లాడటానికిగాని అతనెప్పుడూ ప్రయత్నించేవాడుగూడా గాదు.

అప్పుడప్పుడు అంటే ఆమె పెళ్ళి సంగతి జ్ఞాపకమొచ్చినప్పుడు, రవిబాబుని, ముఖర్జీతో పోల్చిచూచేది. వెంటనే ఆమెగుండె నీరైపోయేది. రోజుకో విధంగా ఆమె మనస్సు వివరమైన నిర్వర్ణకాంతులను విరజిమ్మలేక వికలితమై పోయేది. తను పట్నంలో వుద్యోగంలో ప్రవేశిస్తానని అప్పుడప్పుడు తల్లితో ముచ్చటించి చెప్పేది....అందుకామె ఏమాత్రం యిష్టపడలా! కారణం తను వుద్యోగంలో ప్రవేశించేటప్పుడు వున్న ఆశయ పూరిత సద్గుణాలే వుండ

వచ్చు. తనొకాదర్శ మహిళేగావచ్చు...తనొక స్వచ్ఛంద హృదయంతో మెలగొచ్చు, కాని కాలం ఒకరీతిగావుండదు. సంఘం కన్నుమూసుకుని చూడకుండ వుండలేదు. గుణాన్ని అనుబంధింపబడిన కర్కశమైన బందీగా వుండిపోవడానికి మొదట్లో పెట్టవచ్చు...కాని తర్వాతకాలంలో కాలుజారితే సాయంకోసం వెర్రిమొర్రి కేకలు పెట్టవలసివస్తుందనామె తల్లి భావం. అప్పుడు ముఖర్జీ నామెపెళ్ళిచేసుకోడాని కిష్టం లేకపోవచ్చు ...... పరిస్థితులేరకంగానైనా మారవచ్చు. అనుగుణ్యమైతే బాధలేదు. వ్యతిరేకమైతే అన్యదా భావించ బడవచ్చు. అప్పుడాపరిస్థితికందరూ బాధ్యులే ... ఎవరు బాధ్యులుగారు. "హద్దుమీరితే అగాధంలో పడవలసి వస్తుందమ్మా" అనిమాత్రం తల్లి చెప్పి వుద్యోగప్రస్తావన మాన్పించింది.

విచారంతో దేశిక అడుగులో అడుగు వేసుకుంటూ పశువులదొడ్డిదాటి పెరట్లో కూర్చోడానికి వెళ్ళింది అప్పుడే పాలు తీసుకుని ఎదురుగా వస్తున్న ముఖర్జీ ఆమెనుచూచి "ఏం దేశికా చాలా విచారంగా వున్నట్లున్నావు. మీ అమ్మేమయినా అందా" అన్నాడు ............... "ఏమీ అనలేదు" అందామె.

"మరెందుకైతే అలావున్నావు"

"బాగానే వున్నానుగా...." "మళ్ళీవస్తాను రెండో బర్రెదూడను గూడ విప్పివచ్చాను. అదిచేపుకు పోయింది. యింతలో యీపాలు యింట్లో పెట్టివస్తానంటూ అతను యింట్లోకి వెళ్ళాడు. ఏనాడూ అతనింత చొరవగా తనతో

మాట్లాడలా! ఎందుకో యీ వేళ తనంటే ఎంతో జాలి చూపించాడు. ఎంతో మొరటుమనిషే యయినప్పటికి చాల మృదువుగా ప్రశ్నించాడు ... పాపం మామయ్య చాలా అమాయకుడు అనుకుంటూ గడ్డివాము ప్రక్కగా కూర్చొని ఏదో ఆలోచిస్తోంది దేశిక.

"బర్రె బెదురుతుంది తెల్ల బట్టలు చూచి ...కొంచెం వెనకవైపుకురా. దేశికా" అన్నమాటలు వినబడామె వెనక్కుదిరిగి చూచింది. పాలు పిండుతున్నాడు ... బర్రె కొంచెము అటూయిటూ తల తిప్పతూ కదలుతూ అతన్ని బాధపెడుతోంది. అక్కడనుంచి లేచి వైనకవైపుకు వచ్చి ముఖర్జీకి కొంచెం దూరంలో నిలబడింది. దూరంగా వున్న కట్టుగొయ్యకు కట్టివున్నదూడ పాలకోసం తందరలాడుతూ గుంజుకుంటోంది.

"అయిపోయిందిలే మిగతా పాలన్నీ నీకేలే" అని దూడవైపుదిరిగి అతనన్నాడు. ఆమాట పల్కినప్పు డతని ముఖంలో కనిపించి నమాయకతను చూచామె చాల జాలి పడి..."పాపం తల్లి పాలుదాగటానికూడా పిల్లకధికారమే లేనపుడు...యిక యీ ప్రపంచంలో అబ్బ...బ్బ"...అను కుంది. ముఖర్జీ పాలుపితికి యివతలకు వచ్చి పాలచెంబు దూరంగావుంచి దూడను విప్పడానికని వెళ్లాడు. కాని దూడ దానంతటదే తాడు తెంపుకుని తల్లిదగ్గరకు పరుగెత్తు కెళ్ళింది. అతను కోపంపట్టలేకపోయాడు. దూరంగావున్న దేశికాదేవిదంతా చూచి నవ్వుతూ వుంది. ఆమె నవ్వు విన బడినందువల్ల దూడమీదున్న కోపాన్ని వదిలేసి ఆమాయ

కంగా ఆమెవైపు చూచి "నన్ను చూసి నవ్వుతున్నావా? దేశికా" అన్నాడు...

"నిన్ను చూచిగాదు మామయ్యా" అంది. ఇంతలో బ్రెయిముం దింకోసారి గడ్డివేసివచ్చి యిక వెళ్తాను...నువు గూడా లోపలికొస్తావా..."అన్నాడు.

"రానుగాని...మామయ్యా నిన్నొక మాటడగనా?"

"ఏమిటి దేశికా?"

"అదే...నువు చదువుకున్నట్లయితే ఎంతో బాగుండేది గాదూ?"

"కాని కాలం గడిచిపోయిందిగా."

"పోనీ యిప్పుడైనా ... వయోజనవిద్యాపథకం ప్రభుత్వం నడుపుతోందిగదా"

"అక్కడికి వెళ్ళటానికి నాకెక్కడ తీరుతుంది."

"పోని మనింటిదగ్గరైతే చదువుకునేవాడివా?"

"తప్పకుండా చదివేవాణ్ణి."

"పోనీ నేను చెపుతా ...... నేర్చుకుంటావా?" అమాయికంగా వుండే అతని చూపుల్ని గుచ్చి ప్రశ్న వేసింది.

అతనేమీ మాట్లాడలేకపోయాడు.

"ఏం మామయ్యా" అందామె.

"ఏమిలేదు దేశికా...నేర్చుకోడానికేం అభ్యంతరం లేదు...అంతా ఎవరన్నా చూస్తే ఏమన్నా అనుకోరూ" ఆమాట చెబుతున్నప్పుడతని పెదాలు వణికిన్నై.

పోనీలే...ఎవరు లేనప్పుడు సాయంత్రంపూట నువ్వు పాలుతీసే వేళకి నేను యిక్కడకు వస్తాను .... అప్పుడు నేను చెప్తాను చదువుకోవచ్చును....

సరే ...... ఎవరికి చెప్పవుగా అంటూ ఆమెవైపే దీనంగా చూచాడు ...... ఎవరికి చెప్పనన్నట్లామె తలను వంకరగా తిప్పి జాలిగా అతనివైపు చూచింది.

"వస్తానయితే" అంటూ అతను పాలచెంబు తీసుకుని ఇంటివైపు వెళ్ళిపోయాడు ... ఆమె మెదడులో రైళ్ళు వరుగెత్తినై ...... ఆమె ఆలోచనలు ఆమెను మించిపోయినై ... తన నీడను తనే చూచుకుని భయపడిందిగాబోలు వెంటనే అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది.

# 19

తరువాత రవిబాబు శంకరంలసంగతేమయిందండీ అనడిగాడు, శేఖరాబాటవైపుదిరిగి ... తనకు అదే విషయం మీద ఆశక్తి వున్నట్లు మధుమూర్తి కళ్ళుగూడ ఆయనవైపే జూచినై.

"ఇప్పుడావిషయమే చెప్తా"నంటూ ఆయన మళ్ళీ ఉపక్రమించాడు.

సూరత్‌లోవున్న రవిబాబుకు ఎన్నో సంబంధాలు వచ్చినై. అన్నీ దాదాపు లక్ష దగ్గరదగ్గర ముట్టజెప్పేవే, ఎప్పటికప్పుడు అబ్బాయిని సంప్రదించి చెపుతానని వచ్చిన వాళ్ళని సాగనంపేవాడు వాళ్ళనాన్న. "ఏదోఒక సంబంధం కుదిర్చిన తరువాత ఉత్తరం వ్రాయవచ్చును, అబ్బాయి మనమాట కాదని పోతాడా" అనేది తల్లి గారు.

"ఈ కాలం కుర్రవాళ్ళు మన కాలంనాటివాళ్లు గాదుగా" అన్నాడయన.

"వుండే వన్ని కాలాల్లోను వుంటయి మీరుమాత్రం నన్ను చూడటానికి రాలేదా" అంటూ ఆమెగూడ యింకో వైపెళ్ళింది.

రవి పూర్తిగా వ్యాపారానుభవం గడించా డన్నమాటేకని తన భావాలనెన్నడు మరవలేదు. బహుశా మర్చిపోను కూడ లేడేమో!.......... దుకాణంకి వెళ్ళే టయిము కాలేదుగదా అని యింకేదో చదువుతూనే కూర్చుని వున్నాడు. "ఎవరో జట్కాబండిలో వచ్చారండి" అంటూ పనిమనిషి రాధ రవినుద్దేశించి చెప్పి పంపుదగ్గర కెళ్ళింది. చదువుతున్న పుస్తగం పేజీ గుర్తుగాబెట్టుకుని తను తలెత్తి చూచాడు. ఆశ్చర్యం ... తో ... శంకరం అంటూ లేచి ఆప్యాయంగా శంకరాన్ని కౌగలించుకున్నాడు. అర్ధగంట గడిచేటప్పటికి .... పాతకాలపు ప్రశ్నలు సమాధానాలు అన్నిటిని వెల్లువలుగా వర్షింపజేసుకున్నారు. తరువాత శంకరం, భార్యవైపు దిరిగి ఆమె చంకలోవున్న పసిపిల్లవాడిని తీసుకుని ఒకసారి తను ముద్దుపెట్టుకుని" మీరా

మామగారిదగ్గర కెళ్ళరా" అంటూ రవిబాబు కందించాడు. పసిపిల్లలను చంకలోకి తీసుకుని ముద్దాడటమతనికిదే మొదటిసారి.

"మా అల్లుడి పేరేంపెట్టావు శంకరం" అన్నాడు రవి.

"మీకు నచ్చిన పేరే పెడతామన్నయ్యగారు" అంది శంకరంభార్య లక్ష్మి రవివైపుదిరిగి ..........

"అలాగా .... అయితే .... మోహన్ అని పెట్టండి చెల్లి" అంటూ రవి ఆమెకుచెప్పి మాఅల్లుడికి పేరు మేమే నిర్ణయించుకున్నామని శంకరంవైపు దిరిగి చెప్పాడు ......

"అందరు నవ్వుకున్నారు ......... తరువాత కాసే పాగి ... చంకలో పిల్లవాడ్నొకసారి ముద్దుపెట్టుకొని, "నీకోసమైనా వెంటనే పెళ్ళిచేసుకుంటారా అల్లుడా! అంటూ రవిబాబు మోహన్‌ని లక్ష్మికందించాడు,

"నిజంగా తొందరగా నువుగూడా పెళ్ళిచెసుకోరా రవి"....అన్నాడు శంకరం.

ఇంతలో రాధ కాఫీ తీసుకొచ్చందరికి యిచ్చింది. రాధని చూచేటప్పటికి శంకరానికి రవిబాబుమీదేదో అను మానం వచ్చింది....కారణం ?.... ఆమెగూడ యవ్వనంలో వుంటటం .... రెండోది అందంగాకూడా వుండటంవల్లనే కాబోలు....మళ్ళీ ఎందుకనో రవి చాలామంచివాడు అలాటి వాడుగాదులే అనుకుంటూ....సంబాళించుకున్నాడు.

"మంచినీళ్ళుకూడ తీసుకురా రాధా" అన్నాడు రవి.

"ఎన్ని గళాసులు బాబుగారూ...." అని లోపలి నుంచే అడిగింది.

ఆమెకు చదువుగూడ లేదని "గళాసులూ" అనే మాట శంకరాన్ని కలవరపర్చినై. వెంటనే ఏదో అనుకుంటూనే .... దాచుకోలేక తన మనోవేదన నాపుకోలేక వెంటనే రవివైపు చూస్తూ "యీమె ఎవరు రవి ?" అన్నాడు.

"పాపం ఒక అనాధరా .... ఎవరూ దిక్కులేరు...."

"పెళ్ళికూడా కాలేదా !"

"అయిందట .... ఒక పిల్లవాడుగూడ పుట్టి పోయాడట .... తరువాత కొంతకాలానికి భర్తగూడ చనిపోయాడట పాపం చాలామంచిది. చదువొక్కటే తక్కువ, అన్నీ వున్నతగుణాలే .... ఎవరో ఒకనాడు మనకొట్లో నగలు కొంటానికని వచ్చారు. అంటే వాళ్లు అప్పుడప్పుడు వచ్చి పోతుండే వాళ్ళైతే .... మాటల సందర్భంలో పనిమనిషి దొరక్క చాలా అవస్థపడ్తున్నానండీ అంటే .... వాళ్ళు ఆలుమగలిద్దరూ తరువాతొకనాడు యీ మనిషిని తీసుకొచ్చి యీవివరాలన్నీ చెప్పారు. అప్పటినుండి యిక్కడే పనిచేస్తోంది. వాళ్లు చెప్పినట్లు అన్ని గుణాలు మంచివే"

"అయితే నువ్వింకా అభ్యుదయ పంథాలో నడుస్తూ... పేదలకు రక్షణ కల్పించాలనే సిద్ధాంతాన్ని మర్చిపోలేదన్నమాట. ఇంకానయం పెళ్ళి చేసుకున్నావుగాదు.........".

"తప్పకుండా చేసుకునేవాడినే.........కాని, చదువు లేదు.........పాపం....".

"పోనీ, ఇప్పుడు చెప్పించుకోవచ్చుగా అంటూనే... మళ్ళీ... రవిని చూస్తూ కొంపదీసి అంతపనీ జేసేవు...... మీ నాన్నగారు వూరుకోరన్న సంగతి గుర్తుంచుకో ..." అన్నాడు.

"పెళ్ళీ చేసుకోవచ్చుగా, పోనీ యిప్పుడు చెప్పించుకోవచ్చుగా" అనే మాటలు ఎందుకో రవినిహత్తుకుపోయినై. అనంతమైన ఆలోచనలోకి యెత్తుకుపోయినై.

# 20

రవి ప్రోద్భలంవల్ల శంకరంగూడా లక్ష్మితోసహా... సూరత్‌లోనే ఆగిపోయాడు. శంకరాన్ని మేనేజరుగా నియమించాడు. తను వెళ్ళినా వెళ్ళకపోయినా శంకరమే షాపు వ్యవహారాలన్నీ చక్కబెట్టి వచ్చేవాడు. రవి ఇంటిపని, అటు శంకరం ఇంటిపని అంతా రాధేంచేసేది ...

రవిబాబు ఒంటరిగా కూర్చుని చదువుకుంటున్నాడు. శంకరమింకా షాపునుంచి తిరిగిరాలేదు అతను వుండేకాపురం కొంచెందూరమయినా షాపు మూసినా, తీసినా వ్యవహారాలన్నీ రవితో చర్చించి వెళ్ళటానికి రోజూ వస్తాడు. రాధని కాఫీ తెమ్మని చెప్పి తనింకా పుస్తకంలో మునిగిపోయే వున్నాడు. అడుగులో అడుగువేసుకుంటూ ... భద్రంగా కాఫీ కప్పును పట్టుకుని రాధ తనదగ్గరకొచ్చి కాఫీ అండీ అంది............కాఫీ అందించేటప్పుడామె ముఖంవైపు చూచిన రవికామంటే జాలనిపించింది ...

అందుకే ఏదో ప్రశ్నించటానికే గాబోలు ...... వెళ్ళి పోతున్న రాధను ...'రాధా' అని పిల్చాడు. ఏంకావాలో అని రాధ వెంటనే వెనక్కువచ్చి ... "కాఫీలో చక్కెర తక్కువయిందాండీ" అంది.

"లేదు .... కాని .... రాధా .... నువు పెళ్ళిచేసుకో రాదూ ............" అన్నాడు.

ఆమాటకామె సమాధానం చెప్పలేక వుక్కిరిబిక్కిరయింది.

అదే ప్రశ్నను మళ్ళీ గృచ్ఛి అడిగాడు ... "నన్నెవరు చేసుకుంటారు ... బాబు" అందామె ఒకవేళెవరైనా చేసుకుంటే చేసుకుంటావా రాధా" అనడిగాడు ......

'పొండి బాబు ... అవేంమాటలు' అంటూ ఆమె లోపలికి వెళ్ళిపోయింది .........

కాఫీకప్పు బల్లమీదపెట్టి లోపలికెళ్ళబోయే రాధ చేతిని పట్టుకుని దగ్గరగా తీసుకుని ... "నీ కభ్యంతరం లేక పోతే నేనేచేసుకుంటాను రాధా" అన్నాడు.

"బాబూ ..." అంటూ ఆమె అతని రెండుపాదాల మీద వాలి నమస్కరించింది.

నిజంగారాధా ... చేసుకుంటే నిలాటిదాన్ని చేసుకుంటేనే నా అభ్యుదయవాదనాచెట్టు పుష్పించుతుంది..."

"నాకు చదువురాదు. మోటుమనిషిని ... విధవ రాలిని ... యివన్నీ మర్చిపోయారా ?" అంది.

మొదటిభాగం సమాప్తం.

---

రెండవ భాగం అచ్చులో